శ్రీరస్తు.

# నరసింహ శతకము

టీకా తాత్పర్యసహితము



శేషప్పకవి ప్రణీతము





నేదూరి గంగాధరంగారి
పరిష్కృతము.

పబ్లిషర్:
కొండపల్లి వీరవెంకయ్య
శ్రీసత్యనారాయణబుక్ డిపో, రాజమండ్రి.

# శేషప్ప కవి ప్రశంస.



ఈకవినిగూర్చి యాధారములేమియుఁ దెలియుటలేదు. పద్యములందలి భావములను విమర్శించిచూడఁగా నీతఁడు బీద వాఁడనియును, భక్తుఁడనియును, దేశచరిత్ర నెరిగినవాఁడనియును దోచుచున్నది. పద్యములలో శ్రీమహావిష్ణువును సంబోధించుటలో మృదులము, కాఠిన్యత, బెదరింపు, కోపము జూపి తన భక్తిస్వాతంత్ర్యమును బ్రకటించెను.

ఈశతకమున పద్యములందలి మకుటము "నరసింహా" యనియుండుటచేత నరసింహశతకమని వ్రాఁడవలెనుగాని నృసింహాయని వాడుకొనుట సమంజసముగాదు. ఈశతకము మృదుమధురశైలియు, నూతన భావములు గల్గియున్నది. భాష యంత సలక్షణయుక్తముగాదని పెద్దలుచెప్పుదురు.

ఈకవినిగూర్చి మాగురువుగారగు భరతశాస్త్రాద్యనేక సద్గ్రంథసంపాదకులు, విస్మృతకవిగ్రంథప్రకాశకులు, వాఙ్మయవిమర్శకాగ్రేశ్వరులు బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవి యమ్. ఎ, గారు "శేషప్పకవి" నైజాము మండలములోనున్న ధర్మపురీవాసుఁడు; నందికులమువాఁడు; క్రీ॥ శ॥ 1800 లకు పూర్వుఁడు; అని యనుమానముగానున్నదని చెప్పియున్నారు. శతకకవిజీవితగ్రంథకర్తలగు కీర్తిశేషులయిన వంగూరి సుబ్బారావుగారును నిట్లేవ్రాసియున్నారు.

ఇట్లు విద్వజ్జనవిధేయుఁడు,
నేదూరి గంగాధరం.



శ్రీరస్తు.

శ్రీ బ్రహ్మజ్ఞాక్షభూతేశోభ్యాం నమః

# నృసింహశతకము.



టీ కా తా త్ప ర్య స హి త ము.

శ్రీ మనోహర సురా ♦ ర్చిత సింధుగంభీర
భక్తవత్సలకోటి ♦ భానుతేజ
కంజనేత్ర హిరణ్య ♦ కశ్యపాంతక శూర
సాధురక్షణ శంఖ ♦ చక్రహస్త
ప్రహ్లాదవరద పా ♦ పధ్వంస సర్వేశ
క్షీరసాగరశాయి ♦ కృష్ణవర్ణ
పక్షివాహన నీల ♦ భ్రమరకుంతలజాల
పల్లవారుణ పాద ♦ పద్మయుగళ
తే. చారు శ్రీచందనాగరు ♦ చర్చితాంగ
కుందకుట్మలదంతవై ♦ కుంతధామ
భూషణవికాశ శ్రీధర్మ ♦ పుర నివాస
దుష్టసంహార నరసింహ ♦ దురితదూర.

టీక. భూషణ=అలంకారములచే, వికాస=ప్రకాశించువాఁడా! శ్రీ ధర్మపురనివాసా=శోభతోఁగూడినటువంటి ధర్మపురమే వాసస్థానముగాఁ గలవాఁడా! దుష్ట=దుర్మార్గులను, సంహారా=సంహరించువాఁడా! దురిత=పాపములను, దూర=తొలగించువాఁడా! నరసింహ=ఓ నరసింహమూర్తీ! శ్రీ=లక్ష్మీదేవికి, మనోహర=భర్తయైనవాఁడా! సుర + అర్చిత=దేవతలచేత పూజింపఁబడువాఁడా! సింధు=సముద్రునివలె, గంభీర=గంభీరముగలవాఁడా! భక్త=భక్తులయెడ, వత్సల=ప్రేమగలవాఁడా! కోటిభాను=కోటిసూర్యులవలె, తేజ=తేజస్సుగలవాఁడా! కంజనేత్ర=పద్మములవంటి కన్నులు గలవాఁడా! హిరణ్యకశ్యప + అంతక=హిరణ్యకశ్యపుని చంపినవాఁడా! శూర=శౌర్యముగలవాఁడా! సాధు=సజ్జనులను, రక్షణ=కాపాడువాఁడా! శంఖ=శంఖమును, చక్ర=చక్రమును, హస్త=చేతులందు ధరించువాఁడా! ప్రహ్లాద=ప్రహ్లాదునకు, వరదా=వరముల నిచ్చినవాఁడా! పాపధ్వంస=పాపులను నాశనముచేయువాఁడా! సర్వ + ఈశ=సమస్తమునకుఁ ప్రభువైనవాఁడా! క్షీరసాగర=పాలసముద్రమునందు, శాయి=శయనించువాఁడా! కృష్ణవర్ణ=నల్లని దేహచ్ఛాయ గలవాఁడా! పక్షివాహన=గరుత్మంతుని వాహనముగ నెక్కు-వాఁడా! నీల=నల్లనైన, భ్రమర=తుమ్మెదలవంటి, కుంతల=తలవెండ్రుకల, జాల=సముదాయముగలవాఁడా! పల్లవ + అరుణ=చిగుళ్ళవలె యెఱ్ఱనైన, పాదపద్మయుగళ=పద్మములవంటి యడుగుల జంటగలవాఁడా! చారు=అందమైనట్టి, శ్రీచందన=మంచిగంధముచేతను, అగరు=సుగంధద్రవ్యములచేతను, చర్చిత=పూయబడిన, అంగ=శరీరముగలవాఁడా! కుంద కుట్మల=మల్లెమొగ్గలవంటి, దంత=దంతములుగలవాఁడా! వైకుంఠధామ=వైకుంఠము నివాసముగ గలవాఁడా!

తాత్పర్యము:—అలంకారములచే ప్రకాశించుచు, శోభతోఁగూడిన ధర్మపురము నివాసముగాఁ గల్గి దుర్మార్గుల నాశముచేయుచు, పాపములను తొలగించునట్టి ఓనరసింహస్వామీ! లక్ష్మీదేవికి భర్తయై, సురలచే పూజింపఁబడి, సముద్రునివంటి గంభీరముగల్గి భక్తులను ప్రేమించువాఁడవై, కోటిసూర్యుల కాంతియు, పద్మములవంటి కన్నులు, శంఖచక్రములు ధరించిన చేతు

లుగల్గి, హిరణ్యాకశ్యపుని సంహరించి, సాధులను రక్షించి, ప్రహ్లాదునిధన్యుని చేసినవాఁడవై, పాపములహరించి, సమస్తమునకధిపతివై, పాలసముద్రముల పవళిరుండుమ, కృష్ణవర్ణముకల్గి, గరుడవాహనుఁడవై భ్రమరకుంతలములుగల్గి, చిగురాకుబోలు పాదపద్మములు, దివ్యాంగమును, వైకుంఠవాసమునకుగల్గిన, ఓనరసింహా! నీకు మ్రొక్కెదను.

సీ. పద్మలోచన సీస ♦ పద్యముల్ నీమీఁదఁ
జెప్పఁబూనితి నయ్య ♦ చిత్తగింపు
గణయతిప్రాస ల ♦ క్షణముఁ జూడఁగలేదు
పంచకావ్యశ్లోక ♦ పఠన లేదు
అమరకాండత్రయం ♦ బరసి చూడఁగలేదు
శాస్త్రీయగ్రంథముల్ ♦ చదువలేదు
నీకటాక్షంబున ♦ నే రచించెదఁ గాని
ప్రజ్ఞనాయదిగాదు ♦ ప్రస్తుతింపఁ
తే. దప్పుపడ నేమి సద్భక్తి ♦ తక్కువౌనె
చెఱకునకు వంకపోనేమి ♦ చెడునె తీపు ॥భూ॥ 2

టీ. భూష...దూర, పద్మలోచన=తామరరేకులవంటి కన్నులుఁగల వాఁడా! నీమీదన్=నీపయిని, సీసపద్యముల్=సీసపద్యములను, చెప్పన్ + పూనితిన్=చెప్పుటకు పూనుకొంటిని, అయ్య=ఓయయ్యా, చిత్తగింపు=అంగీకరింపుము, గణ=గణముల యొక్కయు, యతి=యతుల యొక్కయు, ప్రాస=ప్రాసముయొక్కయు, లక్షణముఁ=లక్షణములను, చూడఁగలేదు=విచారించలేదు, *పంచకావ్యశ్లోక పఠనలేదు=పంచకావ్యములందలి శ్లోకములను చదువలేదు, అరసి=ప్రయత్నించి, అమరకాండ త్రయంబు=మూడు కాండలుగల అమరమును, చూడఁగలేదు=చూడలేదు, శాస్త్రీయగ్రం

*పంచకావ్యములు:—1 రఘువంశము, 2 కుమారసంభవము, 3 మేఘసందేశము, 4 భారవి, 5 మాఘము.

థముల్=శాస్త్రగ్రంథములను, చదువలేదు=చదువలేదు, నీకటాక్షంబున= నీదయగల్గిన చూపుచేత, నేరచించెదఁగాని=నేవ్రాయుచున్నను గాని, ప్రస్తుతింపఁగ=పొగడుటకు, ప్రజ్ఞనాయదిగాదు=నాసామర్థ్యమువలనగాదు, తప్పుపడఁగ + ఏమి=తప్పుపడితేయేమి? సద్భక్తి తక్కువౌనె=మంచిభక్తికి లోపముగల్గునా? చెఱకునకు=చెఱకుగడకు, వంకఁగ + పోఁగ=వంకరపోయినచో ఏమి=ఏమిలోపము, చెడునె=చెడిపోవునా? తీపు=మాధుర్యము.

తా. తామరరేకులబోలు నేత్రములుగలిగిన యోనరసింహస్వామీ! నేను నీమీదఁ గొన్ని సీసపద్యములు చెప్పుటకు పూనుకొంటిని, గణయతిప్రాసలక్షణముల విచారింపలేదు. పంచకావ్యముల చదువలేదు, త్రికాండ అమరమునుగాని, శాస్త్రగ్రంథములనుగాని, చదువలేదు. నీకటాక్షముచేత నే వ్రాసెదనుగాని, కొనియాడుటకు నాసామర్థ్యముగాదుసుమా! చెఱుకుగడ వంకరగానుండినను తీపుయేలాగు లోటుపడదో అట్లే తప్పులుపడినను భక్తికి లోపములేదు.

సీ. నరసింహ నీదివ్య ♦ నామమంత్రముచేత
　　దురితజాలము లన్నిఁ ♦ దోలవచ్చు
నరసింహ నీదివ్య ♦ నామమంత్రముచేత
　　బలువైన రోగముల్ ♦ బాపవచ్చు
నరసింహ నీదివ్య ♦ నామమంత్రముచేత
　　రిపుసంఘముల సంహ ♦ రింపవచ్చు
నరసింహ నీదివ్య ♦ నామమంత్రముచేత
　　దండహస్తుని బంట్లఁ ♦ దఱుమవచ్చు
తే. బళిర నే నీ మహామంత్ర ♦ బలముచేత
　　దివ్యవైకుంఠపదవి సా ♦ ధింపవచ్చు ॥భూ॥ 3

టీ. భూష=మార, నరసింహ=ఓనరసింహస్వామీ! నీదివ్య=నీపవిత్రమగునట్టి, నామ=పేరనెడు, మంత్రముచేత=మంత్రముచే (స్మరించుటచేత)

దురితజాలములన్నిఁ=పాపసమూహము లన్నిటికి, తోలవచ్చు=పోఁగొట్టవచ్చును, నర... చేత, బలువు + ఐనరోగముల్=గొప్పవయిన వ్యాధులు, బాపవచ్చు=పోఁగొట్టవచ్చును, నర... చేత, రిపుసంఘముల=శత్రుసమూహములను, సంహరింపవచ్చును=నాశము చేయవచ్చును, నర... చేత, దండహస్తుని=యమునియొక్క, బంట్లఁ=కింకరులను, తఱుమవచ్చు=పారదోలవచ్చును, భళిర=సెబాస్, నేను + ఈమంత్రబలము చేత=నేను నీనామమనెడు మహామంత్రశక్తిచేత, దివ్యవైకుంఠపదవి=శ్రేష్ఠమయిన వైకుంఠపదవిని, సాధింపవచ్చు=పొందవచ్చును.

తా. ఓ నరసింహమూర్తీ! నీపవిత్రమయిన నామమును స్మరించుట చేత, పాపములను పోఁగొట్టవచ్చును, గొప్ప గొప్పరోగములను వారింపవచ్చును, శత్రుసమూహములను నాశనము చేయవచ్చును, యమకింకరులను పారదోలవచ్చును, ఆహా! నేను నీమహామంత్రశక్తిచేత దివ్యమైన వైకుంఠపదవిని పొందవచ్చును.

సీ. ఆదినారాయణా ♦ యనుచు నాలుకతోడఁ
బలుకనేర్చిన వారి ♦ పాదములకు
సాష్టాంగ మగు నమ ♦ స్కార మర్పణఁజేసి
ప్రస్తుతించెదనయ్య ♦ బహువిధముల
ధరణిలో నరులెంత ♦ దండివారైనను
నిన్నుఁ గాననివారి ♦ నే స్మరింప
మేము శ్రేష్ఠులమంచు ♦ మిడుకుచుండెడివారి
చెంతఁ జేరఁగఁబోను ♦ శేషశయన
తే. పరమ సాత్వికులైన నీ ♦ భక్తవరుల
దాసులకు దాసుఁడను జుమ్మి ♦ ధాత్రిలోన ॥భూ॥ 4

టీ. భూష...దూర, ఆదినారాయణాయనుచు=ఆదిదేవాయనుచు, నాలుకతోడఁ=నాలుకతో, పలుకనేర్చినవారి=స్మరణజేయువారియొక్క,

పాదములకు=పాదములకు, * స + అష్ట + అంగము + అగు=ఎనిమిది అంగములు మోపునటువంటి, నమస్కారము=దండము, అర్పణన్ + చేసి=అర్పించి, బహువిధముల=అనేకవిధముల, ప్రస్తుతించెదను + అయ్యా=కొనియాడెదను తండ్రీ! ధరణిలో=భూమిమీద, నరులు=మనుష్యులు, ఎంతదండివారు + ఐనను=ఎంతగొప్పవారలయినను, నిన్నున్=నిన్ను, కానని వారిన్=కనుగొనని వారిని, నేస్మరింప=నేనుస్మరింపను, శేషశయన=ఆదిశేషునిపై పవళించువాడా! మేము శ్రేష్ఠులము + అంచున్=మేముగొప్పవారలమనుచు, మిడుకుచు + ఉండెడి=మిట్టిపడెడి, వారిచెంతన్=వారలదగ్గరకు, చేరఁగన్ + పోను=చేరుటకువెళ్ళను, ధాత్రిలోన=భూమియందు, పరమసాత్వికులు + ఐన=ప్రశస్తమయిన సత్వగుణము గలవారైన, నీభక్తవరుల=నీభక్తులయొక్క, దాసులకు=సేవకులకు, దాసుఁడనుజుమ్మీ=దాసుడను సుమీ!

తా. ఓ నరసింహా! నిన్ను "ఆదినారాయణాయని" నోరారపలుకు వారిపాదములకు సాష్టాంగదండప్రణామములుజేసి, అనేకవిధముల స్తుతింతును. మేము ఘనులమని గర్వించువారినిన్ని, నిన్నుస్మరింపనివారినిన్ని ఎంతఘనులయినను వారిదరికిపోను, వారిని స్మరింపను, పరమసత్వగుణులైన నీభక్తులకు దాసులయినవారికి నేనుదాసుడను సుమా!

సీ. ఐశ్వర్యములకు ని ♦ న్ననుసరింపఁగలేదు
ద్రవ్య మిమ్మని వెంటఁ ♦ దగులలేదు
కనకమిమ్మని చాల ♦ గష్టపెట్టఁగలేదు
పల్లకిమ్మనినోటఁ ♦ బలుకలేదు

---

* సాష్టాంగదండప్రణామము:—

కం॥ కరయుగములు, చరణంబులు,
నురము లలాటస్థలంబు ♦ నున్నతభుజముల్
సరిధరణి మోపి మ్రొక్కిన
పరగున సాష్టాంగమండ్రు ♦ పరమమునీంద్రుల్,

సొమ్ము లిమ్మని నిన్ను ♦ నమ్మికొల్వఁగ లేదు
భూములిమ్మని పేరు ♦ పొగడలేదు
బలము నిమ్మని నిన్ను ♦ బతిమాలగా లేదు
పసుల నిమ్మని ♦ పట్టు పట్టలేదు
తే. నేను గోరిన దొక్కటే ♦ నీలవర్ణ
చయ్యనను మోక్షమిచ్చినఁ జాలునాకు ॥భూ॥ 5

టీ. భూష...దూర, ఐశ్వర్యములకు=భాగ్యములకు, నిన్ను + అనుస రింపఁగ లేదు=నిన్నుఆశ్రయింపలేదు, ద్రవ్యము + ఇమ్ము + అని=ధనమిమ్మని, వెంటన్=వెంటబడి, తగులలేదు=తిరుగ లేదు, కనకము + ఇమ్ము + అని=బంగారమీయుమని, చాలన్=యెక్కువగా, కష్టపెట్టగ లేదు=బలవంతము పెట్టలేదు, పల్లకి + ఇమ్ము + అని=వాహనమీయుమని, నోటన్ + పలుక లేదు=నోటితో పలుకలేదు, సొమ్ములు + ఇమ్ము + అని=నగలీయుమని, నిన్ను నమ్మి=నిన్ను నమ్మకొని, కొల్వఁగ లేదు=సేవింపలేదు, భూములు + ఇమ్ము + అని=పొలములీయుమని, పేరుపొగడలేదు=నీపేరు కొనియాడలేదు, నిన్నున్=నిన్ను, బలము + ఇమ్ము + అని=బలమునీయుమని, బతిమాలగాలేదు=వేడుకొనలేదు, పసులన్ + ఇమ్ము + అని=ఆవులనీయుమని, పట్టుపట్టలేదు=బలవంతపెట్టలేదు నీలవర్ణ=నల్లనైనశరీరకాంతిగలవాఁడా! నేను, కోరినది=అడిగినది, ఒక్కటే, నాకు, చయ్యనను=శీఘ్రముగానే, మోక్షము + ఇచ్చినన్=ముక్తియిచ్చిన, చాలున్=చాలును.

తా. ఓనరసింహా! సంపదలు, ధనము, బంగారము, వాహనములు, నగలు, భూములు, బలము, గోవులు, మొదలగునవి యిమ్మని నిన్నుఅనేక విధముల గోరుటలేదు, ఓనీలవర్ణా! నేనొక మోక్షమునే కోరితిని. శీఘ్రముగ దానినిచ్చిన నాకుఁజాలును.

సీ. మందుఁడ నని నన్ను ♦ నిందఁజేసిన నేమి
నాదీనతనుజూచి ♦ నవ్వనేమి

దూరభావము లేక ♦ దూలనాడిన నేమి
ప్రీతి సేయక వంకఁ ♦ బెట్టనేమి
కక్కసంబులు వల్కి ♦ వెక్కిరించిన నేమి
తీవ్రకోపముచేత ♦ దిట్ట నేమి
యెచ్చుమాటలచేత ♦ నెమ్మిలాడిన నేమి
చేరి దాపటఁగేలి ♦ సేయనేమి
తే. కల్పవృక్షమువలె నీవు ♦ గలుగనింకఁ
బ్రజల లక్ష్యంబు నాకేల ♦ పద్మనాభ ‖భూ‖ 6

టీ. భూష...దూర, మందుడనని=మూర్ఖుఁడనని, నిందన్ + చేసినన్ + ఏమి=తిట్టిన నేమిలోపము, నాదీనతను=నాయొక్క దీనత్వమును, చూచి, నవ్వన్ + ఏమి=నవ్వినను, ఏమి? దూరభావములేక=మంచిచెడ్డయను నాలోచనలేక, తూలన్ + ఆడినన్ ఏమి=దూషించినను ఏమి? ప్రీతిసేయక=ప్రేమఁజూపక, వంకన్ + పెట్ట + ఏమి=తప్పులెంచినను ఏమి? కక్కసంబులువల్కి=కఠినములైన మాటలాడి, వెక్కిరించినన్ + ఏమి=వేళాకోళము జేసిన నేమి, తీవ్రకోపముచేతన్=ఎక్కువకోపముచే, తిట్టన్ + ఏమి=తిట్టిన నేమి, హెచ్చుమాటలచేతన్=అధికమగుమాటలచే, ఎమ్మెలాడినన్ + ఏమి=అసత్యపుపొగడ్తలాడిన నేమి, దాపటన్ + చేరి=సమీపమున నిలిచి, గేలిచేయన్ + ఏమి=పరిహాసముచేసిన నేమి? కల్పవృక్షమువలె=కోర్కెలిచ్చుచెట్టువలె, నీవుగల్గన్=నీవుండగా, పద్మనాభ=పద్మము నాభియందుఁగలవాఁడా, (ఓనరసింహా!) ఇంకన్=ఇంకను, ప్రజల లక్ష్యంబు=మనుజుల లెక్క! నాకు ఏల=నాకెందుకు?.

తా. ఓనరసింహామూర్తీ! నీయందే మనస్సునిల్పి నిన్ను స్మరించుచున్న నన్నుఁజూచి, తెలివితక్కువవాఁడనితిట్టినను, నాదీనత్వముఁ జూచి నవ్వినను, మంచిచెడ్డలెరుఁగక తూలనాడినను, ప్రీతిలేక తప్పులుమోపినను, కష్టముగ మాట్లాడివెక్కిరించినను, ఎక్కువకోపముచేఁ దిట్టినను, గొప్పగాపొగడి పరి

హాసించినను, వేళాకోళముఁజేసినను, నాకేకొఱతలేదు, నేనితరమానవుల లక్ష్యముసేయను, కల్పవృక్షమువలె సమస్తకోరికలనిచ్చు నిన్నేస్మరించెదను.

సీ. చిత్తశుద్ధిగ నీకు ♦ సేవజేసెదఁగాని
పుడమిలో జనుల మె ♦ ప్పులకు గాదు
జన్మ పావనతకై ♦ స్మరణఁ జేసెదఁగాని
సరివారిలోఁ బ్రతి ♦ ష్టలకుఁ గాదు
ముక్తికోసరము నే ♦ మ్రొక్కి వేఁడెదఁగాని
దండిభాగ్యము నిమి ♦ త్తంబుగాదు
నినుఁ బొగడగ విద్య ♦ నేర్చితినే గాని
కుక్షినిండెడు కూటి ♦ కొఱకుఁగాదు
తే. పారమార్థికమునకు నేఁ ♦ బాటుపడితి
గీర్తికి నపేక్ష పడలేదు ♦ కృష్ణవర్ణ ॥భూ॥ 7

టీ. భూష...దూర, చిత్తశుద్ధిగ=నిర్మలమైన మనస్సుతో, నీకు, సేవఁజేసెదగాని=పూజించెదనుకాని, పుడమిలో=భూమిలో, జనుల మెప్పులకుకాదు=జనులపొగడ్తలకుఁ గాదు, జన్మపావనతకై=జన్మముయొక్క పవిత్రతకు, స్మరణచేసెదగాని=స్మరింతునుగాని, సరివారిలోన్=సాటివారిలో, ప్రతిష్ఠలకుకాదు=గౌరవముకొరకుఁగాదు, ముక్తికోసరము=మోక్షముకొరకు, నేన్ మ్రొక్కి=నేనునమస్కరించి, వేఁడెదకాని=ప్రార్థించెదనుగాని, దండిభాగ్యమునిమిత్తముకాదు=ఎక్కువ ధనముగణించు కారణముఁగాదు, నిన్ను పొగడఁగ=నిన్నుస్తుతించుటకే, విద్య నేర్చితి నేగాని=విద్యనేర్చుకొంటినిగాని, కుక్షి=పొట్ట, నిండెడు=నింపుకొనెడు, కూటికొఱకు గాదు, పారమార్థికమునకు=మోక్షముకొఱకు, నేపాటుపడితిన్=ప్రయత్నించితిని, కీర్తికిన్=పేరునకు, అపేక్షపడలేదు=ఆశపడలేను, కృష్ణవర్ణ=నల్లనైనదేహకాంతిగలవాఁడా!

తా. ఓనరసింహా! నిన్ను నిర్మలమనస్సుతో పూజించెదను గాని జనుల మెప్పులకుగాదు, జన్మతరించుటకై నిన్నుస్మరింతునుగాని సాటివారిలో

గొప్ప ప్రతిష్ఠకుగాదు, మోక్షప్రాప్తికై మ్రొక్కెదగాని ఐశ్వర్యమపేక్షించిగాదు, నిన్ను స్తుతించుటకే విద్యనేర్చితినిగాని, పొట్టనింపుకొనుటకు గాదు, ఓనీలవర్ణా! మోక్షముకొరకు యత్నించితినిగాని కీర్తి బొందుటకుగాదు.

సీ. శ్రవణ రంధ్రముల నీ ♦ సత్కథల్ పొగడంగ
లేశ మానందంబు ♦ లేనివాఁడు
పుణ్యవంతులు నిన్నుఁ ♦ బూజసేయఁగ జూచి
భావమం దుత్సాహ ♦ పడనివాఁడు
భక్తవర్యులు నీ ప్ర ♦ భావముల్ పొగడంగఁ
దత్పరత్వము లేక ♦ తలఁగువాఁడు
తనచిత్తమందు నీ ♦ ధ్యాన మెన్నఁడు లేక
కాలమంతయు వృథా ♦ గడపువాఁడు
తే. వసుధలో నెల్ల వ్యర్థుండు ♦ వాఁడె యగును
మఱియుఁ జెఁడుగాక యెప్పుడు ♦ మమతనొంది ॥భూ.॥ 8

టీ. భూష...దూర, నీసత్కథల్=నీసచ్చరిత్రములు, శ్రవణరంధ్రముల=చెవులకడ, పొగడంగ=వర్ణింపగా, లేశము=కొంచెమైనను, ఆనందంబు=సంతోషము, లేనివాఁడు=పొందనివాఁడు, పుణ్యవంతులు=పుణ్యాత్ములు, నిన్నుఁన్, పూజసేయగన్=పూజింపగా, చూచి, భావమందు=మనసునందు, ఉత్సాహపడనివాఁడు=సంతసింపనివాఁడు, భక్తవర్యులు=గొప్ప భక్తులు, నీప్రభావముల్=నీమహిమలను, పొగడంగన్=కొనియాడగా, తత్పరత్వము=ఆసక్తి, లేక, తలఁగువాఁడు=తొలగిపోవువాఁడు, తనచిత్తమందు=తనమనసునందు, నీధ్యానము=నిన్నుదలపోయుట ఎన్నడులేక, కాలమంతయు=జీవితమంతయు, వృథాగడపువాఁడు=ఊరకేవెళ్ళబుచ్చువాఁడు, వసుధలోనెల్లన్=భూమియందంతటను, వాఁడె=అట్టివాడే, వ్యర్థుండ అగును=నిష్ప్రయోజకుఁడగును, మఱియున్=ఇంకను, ఎప్పుడు మమతనొంది=ఎపుడు తెగని మోహముగలవాఁడై, చెడుఁగాక=నశించునుగాక.

తా. ఓనరసింహా! నీసచ్చరిత్రములు చెవులారవిని యానందింపనివాఁడు పుణ్యాత్ములు నీపూజలు చేయగా చూచియుత్సాహపడనివాఁడు, భక్తశ్రేష్ఠులు నీమహిమలు కొనియాడగా విని ఆసక్తిలేక తొలగిపోవువాఁడు మనస్సున నిన్నెప్పుడును దలచక జీవితమంతయు వృథాగడపువాఁడు, యీ ప్రపంచమందు వాడే నిష్ప్రయోజకుఁడు, వాడే, మఱియు యెడతెగని మోహములోబడి నశించును.

సీ. గౌతమీస్నానానఁ ♦ గడ తేరుదామంటె
మొనసి చన్నీళ్ళలో ♦ మునఁగలేను
దీర్ఘయాత్రలచేఁ గృ ♦ తార్థులౌదామంటె
బడలి నేమంబులే ♦ నడుపలేను
దానధర్మముల స ♦ ద్గతిని జెందుద మంటె
ఘనముగా నావద్ద ♦ ధనము లేదు
తపమాచరించి సా ♦ ర్థకత నొందుద మంటె
నిమిషమైన మనస్సు ♦ నిలుపలేను
తే. గష్టముల కోర్వ నాచేత ♦ గాదు నిన్ను
స్మరణచేసెద నాయథా ♦ శక్తి కొలది ॥భూ॥ 9

టీ. భూష... దూర. గౌతమీస్నానన్ = గోదావరినదిలో స్నానముచేయుటచేత, కడ తేరుదామంటె = తరించెదమనిన, మొనసి = పూనుకొని, చన్నీళ్ళలో మునుగలేను, తీర్థయాత్రలచే = పుణ్యస్థలములు దర్శించుటచేత, కృతార్థులౌదామంటె = ధన్యులగుదామనిన, బడలి = శ్రమపడి, ఏన్ = నేను, నేమంబులు = నిష్ఠలు, నడపలేను, దానధర్మములన్ = దానము ధర్మము చేసి, సద్గతిన్ = ముక్తిని, చెందుదమంటె = పొందుదమనిన, నావద్ద, ఘనముగా = విశేషముగా, ధనములేదు = డబ్బులేదు, తపము = తపస్సు, ఆచరించి = చేసి, సార్థకతన్ = మంచిప్రయోజనమును, ఒందుదమంటె = పొందుదమనిన, నిమిషమై

నను, మనస్సు, నిలుపలేను, కష్టములకు, ఓర్వ=సహించుట, నా చేతకాదు=నావల్లగాదు, నిన్ను, నాయభాశక్తికొలది=నా చేతనైనంతవఱకు, స్మరణఁజేసెద=ధ్యానించెదను.

తా. ఓనరసింహా! గౌతమీనదిలో స్నానముచేసి తరింతుమనిన చన్నీళ్ళలో మునుగఁజాలను, పుణ్యతీర్థములు సేవించి ధన్యతను బొందుదమన్న శ్రమపడి నేను నియమములు నడుపజాలను. దానధర్మములు చేసి పుణ్యలోకము సంపాదించెదమన్న నాయొద్ద విశేషధనములేదు. తపముఁజేసి సఫలతనొందుదమన్న మనస్సొక్క నిమిషమైనను నిలుపలేను, కష్టముల కోర్వ నావల్లగాదు. నాశక్తికొలది నీనామమును తలంతును.

సీ. అర్థివాండ్రకు నీక ♦ హానిఁజేయుటకంటెఁ
దెంపుతో వసనాభిఁ ♦ దినుటమేలు
ఆఁడుబిడ్డలసొమ్ము ♦ లపహరించుట కంటె
బండఁ గట్టుక నూతఁ ♦ బడుట మేలు
పరుల కాంతలఁ బట్టి ♦ బల్మిఁ గూడుట కంటె
బడబాగ్ని కీలలఁ ♦ బడుట మేలు
బ్రతుకఁజాలక దొంగ ♦ పనులు సేయుట కంటెఁ
గొంగుతో ముష్టెత్తు ♦ కొనుట మేలు
తే. జలజదళనేత్ర సీభక్త ♦ జనులతోడి
జగడ మాడెడు పనికంటెఁ జావుమేలు ॥భూ॥ 10

టీ. భూష...దూర, అర్థివాండ్రకున్=ఓచ్చగాండ్రకు, ఈక=ఇయ్యక, హానిచేయుటకంటె=కీడొనర్చుటకంటె, తెంపుతో=సాహసముతో, వసనాభిన్=విషమును, తినుటమేలు=తినుటమంచిది. ఆఁడుఁబిడ్డలసొమ్ములు=ఆడుపిల్లలసొత్తులను, అపహరించుటకంటె=దొంగిలించుటకంటె, బండకట్టుక=బండరాయి కట్టుకొని, నూతన్=నూఁయిలో, పడుటమేలు=పడుట

మంచిది, పరులకాంతలఁ=పరస్త్రీలను, పట్టి=పట్టుకొని, బల్మికూడుట కంటె=బలవంతముగా పొందుటకంటె, బడబాగ్నికీలలఁ=మహాగ్ని జ్వాలలందు పడుట మేలు, బ్రతుకఁజాలక=బ్రతుకలేక, దొంగపనులు సేయుటకంటె కొంగుతో ముష్టెత్తుకొనుట మేలు=ఒడిబట్టి బిక్షమెత్తుకొనుటమంచిది, జలజదళ నేత్ర=తామరరేకులవంటి నేత్రములుగలవాఁడా! నీభక్తజనులతోడ=నీభక్తులతో, జగడమాడెడి పనికంటె=కయ్యముపెట్టుకొనుటకంటె, చావు మేలు=చచ్చుటమంచిది.

తా. ఓనరసింహా! బిచ్చగాండ్రకు పెట్టక కీడుచేయుటకంటె వసనాభి తినుటమంచిది, ఆఁడుపిల్లలసొత్తు హరించుటకంటె, బండరాయికట్టుకొని నూతిలోపడుటమంచిది, పరస్త్రీలబలవంతముగా పొందుటకంటె మహాగ్ని జ్వాలలందు పడుటమంచిది, బ్రతుకలేక దొంగపనులుచేయుటకంటె కొంగు పట్టి ముష్టి నెత్తుకొనుట మంచిది, నీభక్తులతో కయ్యమాడుటకంటె చచ్చుట మంచిది.

సీ. గార్దభంబునకేల ♦ కస్తూరి తిలకంబు
మర్కటంబునకేల ♦ మలయజంబు
శార్దూలమునకేల ♦ శర్కరాపూపంబు
సూకరంబునకేల ♦ చూతఫలము
మార్జాలమునకేల ♦ మల్లెపువ్వులబంతి
గుడ్లగూబలకేల ♦ కుండలములు
మహిషంబునకును ని ♦ ర్మలవస్త్ర మదియేల
బకసంతతికి నేల ♦ పంజరంబు
తే. ద్రోహచింతనఁ జేసెడి ♦ దుర్జనులకు
మధురమైనట్టి నీ నామ ♦ మంత్ర మేల ॥భూ॥ 11

టీ. భూష...దూర, కస్తూరితిలకంబు=కస్తూరిబొట్టు గార్దభంబు

నకు=గాడిదకు, ఏల=ఎందుకు, మలయజంబు=మంచిగంధము, మర్కటంబున కేల=కోతికెందుకు, శర్కరాపూపంబు=పంచదారతో చేసినపిండివంట, శార్దూలమున కేల=పెద్దపులికెందుకు, చూతఫలము=మామిడిపండు, సూకరంబున కేల=పందికెందుకు, మల్లెపువ్వులబంతి, మార్జాలమున కేల=పిల్లికెందుకు, కుండలములు, గుడ్లగూబకేల, నిర్మలవస్త్రము=శుభ్రమగుబట్ట, అది=ఆబట్ట, మహిషంబునకును, ఏల=దున్నపోతుకెందుకు, పంజరంబు, బకసంతతికి నేల=కొంగలకెందుకు, ద్రోహచింతజేసెడి=చెడుఆలోచనలు సేయు, దుర్జనులకు=చెడ్డవారలకు, మధురమైనట్టి=తీయనైన, నీనామమంత్ర మేల=నీయొక్క పేరనెడు మంత్రమెందుకు. (అక్కరలేదు.)

తా. ఓనరసింహా! గాడిదకు కస్తూరిబొట్టు, కోతికి మంచిగంధము, పెద్దపులికి పంచదారతో చేసినపిండివంట, పందికి మామిడిపండు, పిల్లికి మల్లెపూవులబంతి, గుడ్లగూబకు కుండలములు, దున్నపోతుకు శుభ్రమగు వస్త్రము, కొంగలకు పంజరము, అవసరములేనట్లే, చెడ్డఆలోచనజేయువారికి నీతీయనైన నామమంత్రమక్కరలేదు.

సీ. పసరంబు పంజైనఁ బసులకాపరి తప్పు
ప్రజలు దుర్జనులైనఁ ♦ బ్రభుని తప్పు
భార్య గయ్యాళైనఁ ♦ బ్రాణనాథుని తప్పు
తనయుండు దుష్టయిన ♦ దండ్రి తప్పు
సైన్యంబు చెదరిన ♦ సైన్యనాథుని తప్పు
కూఁతురు చెడుగైన ♦ మాతతప్పు
అశ్వంబు చెడుగైన ♦ నారోహకుని తప్పు
దంతి దుష్టయిన మా ♦ వంతు తప్పు
తే. ఇట్టి తప్పులెఱుంగక ♦ యిచ్చవచ్చి
నటుల మెలఁగుదు రిప్పుడీ ♦ యవని జనులు ॥భూ॥ 12

టీ. భూష..., దూర, పసరంబు=పశువు, పంగైనన్=చెడ్డదయిన, పశులకాపరితప్పు, ప్రజలు=జనులు, దుర్జనులైనన్=చెడ్డవారలైన, ప్రభుని తప్పు=రాజుతప్పు, భార్య=పెండ్లాము, గయ్యాళియైనన్=ఎదిరించిమాటలాడునదియైన, ప్రాణనాథునితప్పు=భర్తతప్పు, తనయుఁడు=కొమరుఁడు, దుష్టయినన్=చెడ్డవాఁడైనచో, తండ్రితప్పు, సైన్యంబు చెదరిన=యుద్ధభటులుచీలిపోయినచో, సైన్యనాథునితప్పు=సైన్యాధిపతితప్పు, కూతురు, చెడుగైనన్=చెడ్డగుణముగలదైనచో, మాతతప్పు=తల్లితప్పు, అశ్వంబు=గుఱ్ఱము, చెడుగైనన్, ఆరోహకునితప్పు=ఎక్కువానితప్పు, దంతి=ఏనుగు, దుష్టయిన, మావంతుతప్పు=మావటీనితప్పు, ఈ అవనిజనులు=ఈ భూమిలోని ప్రజలు ఇట్టితప్పులు, ఎఱుంగక, ఇప్పుడు=ఈకాలమందు, యిచ్చవచ్చినటుల=యిష్టమువచ్చినట్లు, మెలంగుదురు=నడచుకొందురు.

తా. ఓనరసింహస్వామీ! పశువు మంచిదికానిచో నాతప్పు దానిని కాయువానిది. ప్రజలుదుష్టులైన తప్పు రాజుది. భార్యపెంకిదైన భర్తతప్పు. కుమారుడు చెడ్డయైన తండ్రితప్పు. సైన్యము చెదరిన నాతప్పు సేనానాయకునిది. కూతురు దుష్టయైన తల్లిదితప్పు. గుఱ్ఱము చెడ్డదైన దానినెక్కువానిదా తప్పు. ఏనుగుచెడ్డదైన ఆతప్పు మావటివానిది. ఈప్రపంచమందలి జనులు తాముచేయు నీతప్పులెఱుఁగక సంచరింతురు.

సీ. కోఁతికి జలతారు ♦ కుళ్ళాయి యేటికి
విరజాజిపూదండ ♦ విధవకేల
ముక్కిడి తొత్తుకు ♦ ముత్తెంపు నత్తేల
నద్దమేమిటికి జా ♦ త్యంధునకును
మాచకమ్మకు నేల ♦ మౌక్తిక హారముల్
క్రూరచిత్తునికి స ♦ ద్గోష్ఠులేల
ఇంకబోతునకేల ♦ బింకపు నిష్టలు
వావి యేటికి దుష్ట ♦ వర్తనునకు

తే. మాటనిలకడ సుంకరి ♦ మోటుకేల
చెవిటివానికి సత్కథా ♦ శ్రవణ మేల ॥భూ॥ 13

టీ. భూష ..దూగ, జలతారు కుల్లాయి=జలతారు టోపి, కోఁతికి, ఏటికి? విరజాజిపూదండ=జాజిపువ్వులదండ, విధవకేల=మగడుచచ్చినదాని కెందుకు, ముక్కిడితొత్తుకు=ముక్కులేని లంజియకు, ముత్తెపునత్తేల=ముత్య ములుగూర్చిన నత్తుయెందుకు, జాత్యంధునకును=పుట్టుగ్రుడ్డికి, అద్దమేమిటికి మాచకమ్మకు=మగకొమ్ములు గలదానికి, మౌక్తికాహారముల్=ముత్యాలపే రులు, ఏల, క్రూరచిత్తునకు=చెడ్డమనస్సుగలవానికి, సద్గోష్ఠులేల=మంచిసం భాషణలెందుకు, అంకుబోతుకు=చెడిపకు, బింకపునిష్ఠలు=గట్టినియమ ములు, ఏల, దుష్టవర్తనునకు=చెడునడవడిగలవానికి, వావి=వరుస, ఏటికి, మాటనిలకడ=ఆడినమాట తప్పకుండుట, సుంకరిమోటుకేల=జూదరియు, మొండియు నైనవానికెందుకు, చెవిటివానికి=వినబడనివానికి, సత్కథాశ్ర వణమేల=మంచికథలు వినుటయెందుకు.

తా. ఓనరసింహా! కోఁతికి జలతారుటోపి, విధవకు విరజాజిపువ్వుల దండ, ముక్కులేనిదానికి ముత్యములనత్తు, పుట్టుగ్రుడ్డివానికద్దము, పేడివా నికి ముత్యాలహారము, చెడ్డమనస్సుగలవానికి మంచిసంభాషణలు, అంకుదా నికి గట్టినియమములు, దుర్మార్గునకు వావివరుసలు, జూదరికి, మొండికి మాటనిలకడ, చెవిటివానికి మంచికథలు వినుట ఉపయోగములేనివి.

సీ. మాన్యంబులీయ స ♦ మర్థుఁ డొక్కఁడు లేఁడు
మాన్యముల్ చెఱుప స ♦ మర్థులంత
యెండిన యూళ్ళగోఁ ♦ డెఱుఁగింపఁ డెవ్వఁడుఁ
బండిన యూళ్ళకు ♦ ప్రభువు లంత
యితఁడు పేద యటంచు ♦ నెఱిఁగింపఁ డెవ్వఁడుఁ
గలవారి సిరు లెన్న ♦ గలరు చాలఁ

దనయాలిచేష్టల ♦ తప్పెన్నఁడెవ్వఁడుఁ
బెరకాంత లంకెన్నఁ ♦ బెద్దలంతె
తే. యిట్టి దోషుల కధికార ♦ మిచ్చినట్టి
ప్రభుల తప్పులటంచును ♦ పలుకవలెను ॥భూ॥        14

టీ. భూప...దూర, మాన్యంబులు=పన్నుకట్టని భూములు, ఈ యఁగ=ఇచ్చుటకు, సమర్థుడు=నేర్పరి, ఒక్కఁడు లేఁడు=ఒక్కఁడైనను లేఁడు, మాన్యముల్ చెఱప=పోగొట్టుటకు, సమర్థులంత=అందరు చేతనైనవారె, ఎవ్వ డుఁగ=ఎవ్వడును, ఎండినయూళ్ళ=పంటలుపండని గ్రామములు, గోడు=దుఃఖమును, ఎఱిగింపఁడు=చెప్పడు, పండినయూళ్ళకుఁగ, ప్రభువులంత=అందరు పెద్దలే, యితడు, పేదయటంచు, ఎవ్వడుఁగ, ఎఱిగింపడు, కలవారి=భాగ్యవంతుల, సిరులు=భాగ్యములు, ఎన్నఁగ=పొగడుటకు, కలరుచాల=అనేకులు గలరు, తన యాలిచేష్టలతప్పు=తనభార్యయొక్క వర్తనమందలి దోషములు, ఎవ్వఁడుఁగ, ఎన్నడు=ఎంచడు, అంత=అందరును, పెఱకాంత=ఇతరస్త్రీల, అంకు, ఎన్నఁగ=తప్పుఎంచుటకు, పెద్దలు=పెద్దమనుష్యులే, ఇట్టిదోషులకు=ఇట్టి తప్పుడుపనులు చేయువారికి, అధికారము=పెత్తనము, ఇచ్చినట్టి, ప్రభుల=ప్రభులయొక్క, తప్పులటంచును=తప్పులని, పలుకవలెను=చెప్పవలెను.

తా. మాన్యములిచ్చు వాడొక్కఁడైనలేడు. వానిని పాడుచేయుట కనేకులు కలరు. పండనియూళ్ళసంగతెవ్వడు తలపెట్టడు. పండినయూళ్ళ కందరు పెద్దలే. బీదల కొక్కఁడు సాయపడడు. అందరు భాగ్యవంతులకే సాయము చేతురు. తనభార్య చెడ్డదైన నొక్కఁడు తలపడు. అందరు యితర స్త్రీల తప్పుల లెక్కింతురు. ఈపైవారి కధికారమిచ్చుతప్పు ప్రభువులది.

సీ. తల్లిగర్భమునుండి ♦ ధనము తేఁడెవ్వఁడు
వెళ్ళిపోయెడినాఁడు ♦ వెంటరాదు
లక్షాధికారైన ♦ లవణ మన్నమె కాని
మెఱుఁగు బంగారంబు ♦ మ్రింగబోఁడు

విత్తమార్జనచేసి ♦ విఱ్ఱవీగుటెకాని
కూడఁబెట్టినసొమ్ము ♦ తోడరాదు
పొందుగా మఱుఁగైన ♦ భూమిలోపలఁబెట్టి
దానధర్మము లేక ♦ దాఁచి దాఁచి
తే. తుదకు దొంగలకిత్తురో ♦ దొరల కవునొ
తేనెజుంటీఁగలియ్యవా ♦ తెరువరులకు ॥భూ॥ 15

టీ. భూష...దూర, తల్లిగర్భమునుండి=తల్లికడుపులోనుండి, ఎవ్వఁడును ధనము తేఁడు=డబ్బు తెచ్చుటలేదు, వెళ్ళిపోయెడినాఁడు=చనిపోయినరోజున, వెంటరాదు=కూడ రాదు, లక్షాధికారి ఐనన్=లక్షలకొలఁది డబ్బు గడించినవాఁడైనను, లవణము=ఉప్పును, అన్నమెకాని=అన్నము నే గాని, మెఱుఁగుబంగారంబు=నిగనిగలాడు బంగారముఁ, మ్రింగబోఁడు=తినఁడు, విత్తము=ధనము, ఆర్జనచేసి=సంపాదించి, విఱ్ఱవీఁగుటెకాని=గర్వించుటయే తప్పెకాని, కూడబెట్టినసొమ్ము=దాఁచినసొమ్ము, తోడ రాదు=వెంట రాదు, పొందుగ=జాగ్రత్తగ, మఱుఁగైనభూమిలోపలన్=రహస్యస్థలమునందు పెట్టి దానధర్మము లేక, దాఁచిదాఁచి తుదకు దొంగలకిత్తురో=దొంగలపహరింతురో, దొరలకగునో=ప్రభువులు తీసుకొందురో, జుంటీఁగలు=తేనెటీగలు, తేనెన్=తేనెను, తెరువరులకు=బాటసారులకు, ఇయ్యవా=ఇచ్చుటలేదా.

తా. ఓ నరసింహా! పుట్టినపుడెవ్వఁడు డబ్బుతీసుకొనిరాఁడు. చనిపోయినపుఁడు తీసుకొనిపోలేఁడు, ఎంతడబ్బు సంపాదించినను, ఉప్పు అన్నము నేగాని, బంగారము తినబోఁడు, ధనము సంపాదించితినని గర్వించుట నేగాని చనిపోవునపుడు డబ్బు కూడరాదు, తేనెటీగలు కూడబెట్టిన తేనెను మనుజుల కిచ్చునట్లే, తాను తినక జాగ్రత్తగా భూమిలోపెట్టి దానధర్మములు చేయక దాఁచినడబ్బు చివరకు దొంగలపాలనో, ప్రభువుల పాలనో చేయుదురు.

సీ. లోకమం దెవఁడైన ◆ లోభిమానవుఁ డున్న
భిక్షమర్థికిఁ జేతఁ ◆ బెట్టలేఁడు
తాను బెట్టకయున్నఁ ◆ దగవు పుట్టదుగాని
యొరులు పెట్టఁగఁ జూచి ◆ యోర్వలేఁడు
దాతదగ్గఱఁ జేరి ◆ తనముల్లె చెడినట్లు
జిహ్వతోఁ జాడీలు ◆ జెప్పుచుండు
ఫలము విఘ్నంబైన ◆ బలుసంతసమునందు
మేలుగల్గినఁ జాల ◆ మిడుకుచుండు
తే. శ్రీరమానాథ యిటువంటి ◆ క్రూరునకును
భిక్షకుల శత్రువని పేరు ◆ పెట్టవచ్చు ॥భూ॥ 16

టీ. భూష.. దూర, లోకమందు, ఎవఁడైనన్, లోభిమానవుఁడు=డబ్బుఖర్చుఁజేయనివాఁడు, ఉన్న=ఉన్నచో, భిక్షము=ముష్టి, అర్థికిన్=అడుగుకొనువానికి, చేతన్=చేతితో, పెట్టలేఁడు, తాను, పెట్టకయున్నన్, తగవుపుట్టదుగాని=జగడముకలుగదుకాని, ఒరులు=యితరులు, పెట్టగచూచి, ఓర్వలేఁడు, దాతదగ్గఱ చేరి=ఇచ్చువానిదగ్గరకువెళ్ళి, తనముల్లె=తనధనము, చెడినట్లు, జిహ్వతో=నాలుకతో, చాడీలు=కొండెములు, చెప్పుచుండు, ఫలము=రానున్న లాభము, విఘ్నంబైనన్=రాకుండిన, బలుసంతసమందు=ఎక్కువ సంతోషమును పొందును, మేలుగల్గిన=లాభము చేకూరిన, చాలమిడుకుచుండు=ఎక్కువగా విచారింపుచుండును, శ్రీరమానాథ=శ్రీలక్ష్మీదేవికి భర్తయైనవాఁడా! ఇటువంటి, క్రూరునకును=చెడ్డవానికి, భిక్షకుల శత్రువని=బిచ్చగాండ్రకు పగవాఁడని, పేరుపెట్టవచ్చు=పేరుపెట్టవచ్చును.

తా. ఓనరసింహా! ఈలోకములో లోభివాఁడు బిచ్చగాండ్రకేమియునియ్యఁడు, తాను పెట్టకపోయినను తగవులేదుకాని, యితరులు పెట్టుట జూచి సహింపఁడు, దాతదగ్గరకువెళ్ళి తనదేపోయినట్లుగా చాడీలుచెప్పును, తనకోర్కె ఫలించినచో సంతసించి, కోర్కె ఫలించనిచో విచారించును. ఇటువంటి వాడిని బిచ్చగాండ్రకు పగవాఁడని పేరుపెట్టవచ్చును.

సీ. తనువులో బ్రాణముల్ ♦ తర్లిపోయెడివేళ
నీస్వరూపమును ♦ ధ్యా ♦ నించునతఁడు
నిమిషమాత్రములోన ♦ నిన్నుఁ జేరును గాని
యమునిచేతికిఁ జిక్కి ♦ శ్రమలఁ బడఁడు
పరమ సంతోషాన ♦ భజనసేసెడువారి
పుణ్య మేమనవచ్చు ♦ భోగిశయన
మోక్షము నీ దాస ♦ ముఖ్యుల కగుఁ గాని
నరక మెక్కడిదయ్య ♦ నళిననేత్ర
తే. కమలనాభుని మహిమలు ♦ గానలేని
తుచ్ఛులకు ముక్తి దొరకుట ♦ దుర్లభంబు ॥భూ॥ 17

టీ. భూష...దూర, తనువులోన్=బొందిలోనుండి, ప్రాణముల్, తర్లిపోయెడువేళ=లేచిపోవునపుఁడు, నీస్వరూపము=నీమూర్తిని, ధ్యానించునతడు=తలఁచుకొనువాఁడు, నిమిషమాత్రములో, నిన్ను చేరునుకాని యమునిచేతికిన్ చిక్కి=యమునకు వశమై, శ్రమలపడఁడు, భోగిశయన=పాముమీదపరుండువాఁడా! పరమసంతోషాన=ఎక్కుచసంతోషముచే, భజనన్ చేసెడివారి=నిన్నుభజించువారి, పుణ్యము, ఏమనవచ్చున్=ఏమని చెప్పవచ్చును, నళిననేత్రా!=తామరపూవులవంటి కన్నులుగలవాఁడా! నీదాస ముఖ్యులకు=నీభక్తులలో శ్రేష్ఠులగువారికి, మోక్షమగును గాని, నరకము, ఎక్కడిదయ్యా=ఎందుకు కలుగునయ్యా, కమలనాభుని=విష్ణుని, మహిమలు=గొప్పలు, కానలేని=తెలిసికొనలేని, తుచ్ఛులకు=నీచులకు, ముక్తి=మోక్షము దొరకుట=కలుగుట, దుర్లభంబు=అసాధ్యము.

తా. ఓనరసింహస్వామీ! చనిపోవునపుడు నీరూపమెుకమారు తలంచినవాఁడు యమలోకమునకుబోక వైకుంఠము జేరును. నీభజనచేయువాని పుణ్యమిట్టిదని, యెవ్వరును చెప్పలేరు, నీభక్తులకు మోక్షమేగాని నరకముండదు. నీమహిమ తెలియనివారికి ముక్తి దొరకదు.

సీ. నీలమేఘశ్యామ ♦ నీవె తండ్రివి మాకుఁ
గమలవాసిని మమ్మ ♦ గన్నతల్లి
నీభక్తవరులంత ♦ నిజమైన బాంధవుల్
నీకటాక్షము మాక ♦ నేకధనము
నీకీర్తనలు మాకు ♦ లోక ప్రపంచంబు
నీసహాయము మాకు ♦ నిత్యసుఖము
నీమంత్రమే మాకు ♦ నిష్కళంకపు విద్య
నీపదధ్యానంబు ♦ నిత్యజపము
తే. తోయజాతాక్ష నీపాద ♦ తులసిదళము
రోగముల కౌషధము బ్రహ్మరుద్రవినుత ॥భూ॥ 18

టీ. భూష...దూర, నీలమేఘశ్యామ=నీలమేఘమువలె నల్లనైన వాఁడా! మాకు, నీవె, తండ్రివి, కమలవాసిని తామరలందు నివసించులక్ష్మి, మమ్మగన్నతల్లి, నీభక్తవరులంత=నిన్ను ధ్యానించువారందరు, నిజమైన, బాంధవుల్=చుట్టములు, నీకటాక్షము, మాకు, అనేకధనము=విస్తారమగు డబ్బు, నీకీర్తనలు=నీచరిత్రలు పాడుటయే, మాకు, లోకప్రపంచంబు=లోక సముదాయము, నీసహాయము, మాకు, నిత్యసుఖము=ఎల్లప్పుడును సుఖము గలిగించును, నీమంత్రమే=నీనామమును జపించుటే, మాకు, నిష్కళంకపు విద్య=పవిత్రమైనజ్ఞానము, నీపదధ్యానంబు=నీపాదములు ధ్యానించుట, నిత్య జపము=యెల్లప్పుడు సేయు జపము, బ్రహ్మరుద్రవినుత=బ్రహ్మచే, శివునిచే పొగడబడినవాఁడా! తోయజాతాక్ష=తామరలవంటి నేత్రములుగలవాఁడా! నీపాదతులసిదళము=నీపాదపూజకై యుపయోగించిన తులసిఆకులు, రోగ ములకౌషధము=సమస్తజబ్బులకు మందు.

తా. ఓనరసింహా! నీవే మాకు తండ్రివి, లక్ష్మీదేవి మాతల్లి, నీభక్తులు మాబంధువులు, నీయనుగ్రహమే మాసమస్తఐశ్వర్యము, నీనామస్మరణయే

మాకు సమస్తలోకము, నీతోడేమాకు నిత్యము సుఖము, నీనామము జపించుటేమాకు పవిత్రమైన విద్య, నీపాదములు ధ్యానించుటే మాకు నిత్యముచేయు జపము. నీపాదపూజకుపయోగించిన తులసిదళమే సమస్త రోగములకు ఔషధము.

సీ. బ్రతికి నన్నాళ్లు నీ • భజన తప్పనుగాని
మరణకాలమునందు • మఱతునేమొ
యావేళయమదూత • లాగ్రహంబున వచ్చి
ప్రాణముల్ పెకలించి • పట్టునపుడు
కఫవాతపైత్యముల్ • గప్ప గాబరచేతఁ
గంప ముద్భవమంది • కష్టపడుచు
నాజిహ్వతోఁ నిన్ను • నారాయణాయంచుఁ
బిలుతునో శ్రమచేతఁ • బిలువలేనొ
తే. నాఁటికిప్పుడె భక్తినీ • నామమిదిగొ
తలఁచెదను జెవి నిడవయ్య • ధైర్యముగను ॥భూ॥ 19

టీ. భూష...దూర, బ్రతికినన్నాళ్ళు, నీభజన తప్పను=నిన్ను సేవించుట మానను, కాని, మరణకాలమునందు=చనిపోవునప్పుడు, మఱతునేమొ, ఆవేళ=ఆకాలమునందు, యమదూతలు=యమునిభటులు, ఆగ్రహంబున=కోపముతో, వచ్చి, ప్రాణముల్, పెకలించి=ఊడదీసి, పట్టునపుడు=పట్టుకొనునపుడు, కఫవాతపైత్యముల్=కఫము, వాతము, పైత్యములు, కప్ప=క్రమ్మిన గాబరచేతన్=కంగారుచేతను, కంపము=వణకు, ఉద్భవమంది=పుట్టి కష్టపడుచు, నిన్ను, నాజిహ్వతో=నానాలుకతో, నారాయణాయంచున్=ఓ నారాయణాయని, పిలుతునో, శ్రమచేతన్=మరణబాధచేత, పిలువలేనో=పిలువలేకపోవుదునో, నాఁటికి=ఆరోజునకు, ఇప్పుడె=ఈరోజుననే, భక్తి నీనామము=నీపేరును, ధైర్యముగను=నిర్భయముగ, తలచెదను, చెవిని=చెవిలో, ఇడవయ్య=ఉంచుమయ్య (వినవయ్యా!)

తా. ఓనరసింహా! బ్రతికినన్నిరోజులును నీస్మరణతప్పక చేయుదును, కాని, చచ్చిపోవునపుడు మఱతునేమో! ఎందుచేతననగా! మరణకాలమున యమదూతలు కోపముతో వచ్చి ప్రాణములూడదీసి పట్టుకొనునపుడు కఫ, వాత, పైత్యత్రిదోషములు వృద్ధిపొంది కంగారుచేత వణకుపుట్టి మరణబాధచేనిన్ను నారాయణాయని నానాలుకతో పిలుతునో! లేక పిలువలేనో! కావున ఆమృత్యుదినమునకు బదులు భక్తితో నిప్పుడే నిశ్చయముగా నీనామమును స్మరింతును.

సీ. పాంచభౌతికము దు ♦ ర్భరమైన కాయంబి
దెప్పుడో విడుచుట ♦ యెఱుకలేదు
శతవర్షములదాక ♦ మితముఁజెప్పిరిగాని
నమ్మరాదామాట ♦ నెమ్మనమున
బాల్యమందో మంచి ♦ ప్రాయమందో లేక
ముదిమియందో లేక ♦ ముసలియందో
యూరనో యడవినో ♦ యుదకమధ్యముననో
యెప్పుడో విడుచుట ♦ యేక్షణంబో
తే. మరణమే నిశ్చయము బుద్ధిమంతుఁడైన
దేహమున్నంతలో మిమ్ముఁ ♦ దెలియవలయు ॥భూ॥ 20

టీ. భూష...దూర, పాంచభౌతికము=ఐదు భూతములతోఁగూడినది, దుర్భరమైన=భరింపసాధ్యముగాని, కాయంబిది=ఈశరీరము, ఎప్పుడో విడుచుట, ఎఱుకలేదు=తెలియదు, శతవర్షములదాఁక=నూరుసంవత్సరములవఱకు, మితముఁ=గడువును చెప్పిరిగాని, ఆమాట, నెమ్మనమున=మనసునందు, నమ్మరాదు, బాల్యమందో, మంచిప్రాయమందో=యౌవనమునందో, లేక, ముదిమియందో=పడుచుతనముననో, ముసలియందో=ముసలితనమునందో ఊరనో=గ్రామమునందుననో, అడవినో, ఉదకమధ్యముననో, ఎప్పుడో.

విడుచుట, ఏక్షణంబో, మరణమే=చావే, నిశ్చయము=నిజము, బుద్ధిమంతుఁడు + ఐన=జ్ఞానముకలిగినవాఁడయినచో, దేహము, ఉన్నంతలో, మిమ్ము, తెలియవలయు=తెలిసికొనవలయును.

తా. ఓనరసింహా! పంచభూతములతోఁగూడి భరింపరాని యీశరీరము తప్పక నశించును కాని, ఎప్పుడో తెలుసుకొనలేము శరీరము నూరేండ్లుండునని పద్దుఁజెప్పిరి. కాని, ఆమాటనమ్మరాదు, బాల్య, యౌవ్వన, కౌమార, వార్ధక్యావస్థల దేనియందో ఊరనో అడవినో నీళ్ళమధ్యనో ఎప్పుడో ఏనిమిషముననో ప్రాణము పోవుటనిశ్చయము, కావున బుద్ధిమంతుఁడైనవాఁడు శరీరమున్నప్పుడే, నిన్ను తెలుసుకొనవలయును.

సీ. తల్లిదండ్రులు భార్య • తనయు లాప్తులు బావ
మఱఁదు లన్నలు మేన • మామగారు
ఘనముగా బంధువుల్ • గల్గినప్పటికైనఁ
దాను దర్లగ వెంటఁ దగిలిరారు
యముని దూతలు ప్రాణ • మపహరించుక పోఁగ
మమతతోఁ బోగాడి • మాన్పలేరు
బలగ మందఱు దుఃఖ • పడుటమాత్రమె కాని
యించుక యాయుష్య • మియ్యలేరు
తే. చుట్టములమీఁది భ్రమ దీసి • చూరఁజెక్కి
సంతతము మిమ్ము నమ్ముట • సార్థకంబు ॥భూ॥ 21

టీ. భూష...దూర, తల్లిదండ్రులు, భార్య, తనయులు, ఆప్తులు=ఇష్టులు, బావమరఁదులు, అన్నలు, మేనమామగారు, ఘనముగా=ఎక్కువగా, బంధువుల్=చుట్టములు, కల్గినప్పటికైనన్=ఉన్నప్పటికిని, తానున్=తాను తర్లగ=ప్రయాణముకాగా (బొందివిడిచి పోవుచుండగా) వెంటన్ తగిలి రారు=వెంటఁబడి రారు, యమునిదూతలు, ప్రాణము, అపహరించుకపోఁగ=

ఎత్తుకొనిపోవుచుండగ, మమతతోన్=అభిమానముతో, పోరాడి=జగడమాడి, మాన్పలేరు=ఆపలేరు, బంగరునందను=చుట్టములందఱును, దుఃఖపడుటమాత్రమె గాని=ఏడ్చుటెగాని, ఇంచుక=కొంచెమైనను, ఆయుష్యము=ఆయువు, ఇయ్యలేరు=కల్గింపలేరు, చుట్టములమీఁది భ్రమన్=ప్రేమను, తీసి=లాగి, దూఁటెక్కి=దూరకత్తితోఁజెక్కి, సంతతము=ఎల్లప్పుడు మిమ్ము నమ్ముట, సార్థకంబు=ప్రయోజనము.

తా. ఓనరసింహా! తలిదండ్రులు భార్యాపుత్రులు మిత్రులుబావమఱుదులు సోదరులు మేనమామలు మొదలగు చుట్టములెంతమంది యున్నను తాను చనిపోవునపుడు వెంటరారు. యమకింకరులు జీవము తీసుకపోవుచుండ అభిమానముగా జగడమాడి మాన్పలేరు. అందరు ఏడ్చుటెకాని కొంచెమైన ఆయువు నియ్యలేరు కావున చుట్టములమీది భ్రమ తెంపుకొని ఎల్లప్పుడును మిమ్ము సేవించుట ప్రయోజనము.

సీ. ఇభరాజవరద ♦ ని ♦ న్నెంత బిల్చినఁగాని
మాఱు పల్కవదేమి ♦ మౌనితనము
మునిజనార్చిత నిన్ను ♦ మ్రొక్కివేడినఁగాని
కనులఁ బడవదేమి ♦ గడుసుఁదనము
చాల దైన్యమునొంది ♦ చాటుచొచ్చినఁగాని
భాగ్యమియ్య వదేమి ♦ ప్రౌఢతనము
స్థిరముగా నీపాద ♦ సేవ జేసెద నన్న
దొరకఁ జాలవదేమి ♦ ధూర్తతనము
తే. మోక్షదాయక యిటువంటి ♦ మూర్ఖజనుని
కష్టపెట్టిన నీకేమి ♦ కడుపునిండు ॥భూ॥ 22

టీ. భూష...దూర, ఇభరాజవరద=గజేంద్రునకు వరములనిచ్చినవాఁడా! నిన్ను, ఎంతపిల్చినఁగాని, మాఱుపల్కవు=జవాబు చెప్పవు, అది, ఏమిమౌనితనము=ఏటికామౌనముగానుండుట, మునిజనార్చిత=ముని

లచే పూజింపఁబడినవాఁడా! నిన్ను, మ్రొక్కి, వేఁడినకాని=ప్రార్థించిన గాని, కనులపడవు=కనబడవు, అది, ఏమి, గడుసుఁదనము=కఠినపుతనము, చాలదైన్యముతోఁ=ఎక్కువదీనత్వము, ఒంది=పొంది, చాటు చొచ్చినఁగాని=చాటునకుజేరినగాని, భాగ్యము, ఇయ్యవు, అది, యేమి, ప్రౌఢిత నము=నేర్పరితనము, స్థిరముగా=ఎల్లప్పుడు, నీపాదసేవఁ, చేసెదఁ + అన్న=చేతుననిన, దొరకఁ + చాలవు=పట్టుపడవు, అది, ఏమి, ధూర్తత నము=మోసగుణము, మోక్షదాయక=ముక్తి నిచ్చువాఁడా! ఇటువంటి, మూర్ఖజనుని=తెలివిలేనివానిని, కష్టపెట్టిన, నీకు, ఏమి, కడుపునిండు=తృప్తి గలుగును.

తా. ఓనరసింహా! గజేంద్రునకు వరములనిచ్చినవాఁడా! నిన్నెన్ని సార్లు పిలచినను జబాబు చెప్పవు, ఇదేమి మూగవ్రతము, మునులచే పూజింపబడినవాఁడా! నీకుమ్రొక్కి ప్రార్థించినగాని కనబడవు, ఇదేమికాఠిన్యము, మిక్కిలి దీనత్వముతో నీమరుఁగుజేరినను ఐశ్వర్య మీయవు, ఇదేమి నేర్పరితనము, ఎల్లప్పుడు నీపాదసేవ జేసెదనన్న పట్టుపడవు, ఇదేమి మోసగుణము, ఓముక్తినిచ్చువాఁడా! నావంటి తెలివిహీనుని కష్టపెట్టినచో! నీకేమి కడుపునిండును.

సీ. నీమీఁదకీర్తనల్ ♦ నిత్యగానముజేసి
రమ్యమొందింప నా ♦ రదుఁడఁగాను
సావధానముగ నీ ♦ చరణ పంకజసేవ
సలిపి మెప్పింపంగ ♦ శబరిఁ గాను
బాల్యమప్పటినుండి ♦ భక్తి నీయందులఁ
గలుగను బ్రహ్లాద ♦ ఘనుఁడగాను
ఘనముగా నీమీఁద ♦ గ్రంథముల్ గల్పించి
వినుతి సేయను వ్యాస ♦ మునిని గాను
తే. సాధుఁడను మూర్ఖమతి మను ♦ ష్యాధముఁడను
హీనుఁడనుజుమ్మి నీవు న ♦ న్నేలుకొనుము ॥భూ॥ 23

టీక. భూష...దూర, నీమీఁదికీర్తనల్=నిన్నుగురించిన పాటలు, నిత్యగానము సేసి=ఎల్లప్పుడు పాడి, రమ్యమొందింపఁగ=రంజింపజేయుటకు, నారదుడను కాను, సావధానముగఁ=శ్రద్ధతో, నీచరణపంకజ సేవసలిపి=నీపాదపద్మములకు పూజచేసి, మెప్పింపంగ, శబరినిగాను, బాల్యమప్పటి నుండి=చిన్నతనము నుండియు, నీయందులఁ=నీయెడల, భక్తికలుగను, ప్రహ్లాదఘనుడ కాను, నీమీఁదిగ్రంథముల్=నీగుణములు తెలియజేయు పుస్తకములు, కల్పించి=వ్రాసి, ఘనముగా, వినుతిసేయను=పొగడుటకు, వ్యాసమునినికాను, సాధుడఁను=మంచిగుణములు గలవాఁడను, మూర్ఖమతిఁ=తెలివిమాలినవాఁడను, మనుష్యాధముఁడను=నీచమనుజుఁడను, హీనుఁడను జుమ్మి=కొద్దివాడను జుమా! నీవు, నన్ను, ఏలుకొనుము=పాలింపుము.

తా. ఓ నరసింహా! ఎల్లప్పుడు నిన్నుగూర్చిన పాటలుపాడి నిన్ను రంజింపఁజేయుటకు నేను నారదుడనుకాను, శ్రద్ధతో నీపాదపూజచేసి నిన్ను మెప్పింపఁజేయుటకు నేను శబరినికాను, చిన్నప్పటినుండియు నీయెడల భక్తిగలిగియుండుటకు నేను ప్రహ్లాదుడనుగాను, నీమీఁద పుస్తకములు వ్రాసి గొప్పగాపొగడుటకు నేను వ్యాసుఁడనుకాను, నేను సాధుఁడను, మూర్ఖుఁడను, అతినీచుడను, మనుజులలో హీనుఁడను ఇట్టి నన్ను నీవు పాలింపుము సుమా!

సీ. అతిశయంబుగఁ గల్ల ♦ లాడనేర్చితిఁగాని
పాటిగా సత్యముల్ ♦ పలుకనేర
సత్కార్య విఘ్నముల్ ♦ సలుపనేర్చితిఁగాని
యిష్టమొందగ నిర్వ ♦ హింపనేర
నౌకరి సొమ్ముకు దోసి ♦ లొగ్గనేర్చితిఁ గాని
చెలువుగా ధర్మంబు ♦ సేయనేర
ధనము లియ్యంగ వ ♦ ద్దనఁగ నేర్చితిఁగాని
శీఘ్ర మిచ్చెదనట్లు ♦ చెప్పనేరఁ

తే. బంకజాతాక్ష నే నెంతొ ♦ పాతకుఁడను
దప్పులన్నియు క్షమియింపు ♦ దండ్రి వీవె ॥భూ॥ 24

టీక. భూష...దూర, అతిశయంబుగ౯=ఎక్కువగా, కల్లలు= అబద్ధములు, ఆడ నేర్చితికాని=ఆడుట నేర్చుకుంటినికాని, పాటిగా=సరిగా, సత్యముల్=నిజములు, పలుక నేర, సత్కార్య=మంచిపనుల, విఘ్నముల్=చెరుపుటలు, సలుప నేర్చితినికాని=చేయఁగలిగితినిగాని, ఇష్టమొందఁగ=కోర్కెలు సమకూర్ప, నిర్వహింప నేర౯=కడ తేర్చలేను, ఒకరిసొమ్ముకు, దోసిలొగ్గ నేర్చితిఁగాని=చేయిచాపగలిగితినికాని, చెలువుగా=చక్కగా, ధర్మంబు=దానము, సేయ నేర౯=జేయజాలను, ధనములియ్యంగ౯=ఒకరు ద్రవ్యమిచ్చుచుండగా, వద్దు, అనఁగ=అనుటకు, నేర్చితి౯ కాని, శీఘ్రము=త్వరలో, ఇచ్చెదునట్లు=ఇచ్చువిధముగా, చెప్ప నేర౯=చెప్పజాలను, పంకజాతాక్ష=పద్మములవంటి నేత్రములుగలవాఁడా! నేను, ఎంతొ పాతకుఁడను=ఎన్నియో పాపములు జేసినవాఁడను, తప్పులు, అన్నియు క్షమియింపు=సైరింపు, ఈవె=నీవె, తండ్రివి.

తా. ఓనరసింహా! ఎక్కువ అబద్ధములాడ నేర్చితి నే గాని సరిగా నిజమాడ నేరను, మంచిపనులకు విఘ్నము చేయఁగల్గితి నేగాని నెరవేర్పజాలను, ఒకరిధనమునకు చేఁజాపగల్గితి నే గాని ధర్మము చేయ నేరను, దానములిచ్చుచుండ వద్దని చెప్ప నేర్చితి నేగాని త్వరగా యిచ్చునట్లు చెప్ప నేరను, నేన నేక పాపములు చేసినవాఁడను నాతప్పులన్నియు సైరించి కాపాడుటకు నీవే తండ్రివి.

సీ. ఉర్విలో నాయుష్య ♦ మున్న పర్యంతంబు
మాయ సంసారంబు ♦ మఱిగి నరుఁడు
సకల పాపములైన ♦ సంగ్రహించునుగాని
నిన్నుఁ జేరెడుయుక్తి ♦ నేర్వలేఁడు
తుదకు గాలునివద్ది ♦ దూతలిద్దఱువచ్చి

గుంజుక చనివారు • కొట్టుచుండ
హింస కోర్వఁగలేక • యేడ్చి గంతులువైచి
దిక్కులేదనినాల్గు • దిశలుఁ జూడఁ
తే. దన్ను విడిపింప వచ్చెడి • ధన్యుఁడేడి
ముందె నీదాసుఁ డయ్యున్న • ముక్తిగలుగు ॥భూ॥ 25

టీ. భూష... దూర, నరుఁడు=మనుష్యుడు, ఉర్విలోన=భూమియందు, ఆయుష్యము=ఆయువు, ఉన్నపర్యంతము, మాయసంసారము మఱిగి=మాయతోఁగూడిన సంసారమున కలవాటుపడి, సకలపాపములైనన్=సమస్తపాపములయినప్పటికిన్ని, సంగ్రహించును=సంపాదించును, కాని, నిన్నున్ చేరెడియుక్తి=నిన్ను సమీపించునుపాయము, నేర్వలేఁడు=నేర్చుకొనడు, తుదకు, కాలునిదూతలు=యమునిబంట్లు, ఇద్దరు, వచ్చి, గుంజుక చని=లాగుకొనిపోయి, వారుకొట్టుచుండ, హింసకు=బాధకు, ఓర్వఁగలేక, ఏడ్చి, గంతులువైచి=చిందులుద్రొక్కి, దిక్కులేదని=రక్షించువాఁడు లేడని, నాల్గుదిశలన్=నలువైపులను, చూడఁగన్=చూడగా, తన్ను, విడిపింప=విడిపించుటకు, వచ్చెడి, ధన్యుఁడేడి=పుణ్యాత్ముడుఏడి? ముందె=జీవితమందె, నీదాసుఁడు=నీకు సేవజేయువాఁడు, ఐయున్న, ముక్తిగలుగు=మోక్షము గల్గును.

తా. ఓనరసింహా! భూమిలో నరుఁడు బ్రతికినన్నాళ్ళు మాయసంసారమున కలవాటుపడి యనేక పాపములైనను సంపాదించును. చివరకు యమభటులువచ్చి ప్రాణమును లాగుకొనిపోయి కొట్టుచుండగా బాధకోర్వలేక యేడ్చి చిందులుద్రొక్కుచు నలువైపులజూచి తన్నుగాపాడువారులేరాయని దీనుఁడైపరికింపగా వచ్చి రక్షించు పుణ్యాత్ము డెవ్వఁడును లేఁడు. కావున జీవితమునందె నీదాసుడయినచో మోక్షము గల్గును.

సీ. అధికవిద్యావంతు • లప్రయోజకులైరి
పూర్ణశుంఠలు సభా • పూజ్యులైరి

సత్యవంతులమాట ♦ జన విరోధంబాయె
వదరుపోతులమాట ♦ వాసికెక్కె
ధర్మవాదనపరుల్ ♦ దారిద్ర్యమొందిరి
పరమలోభులు ధన ♦ ప్రాప్తులైరి
పుణ్యవంతులు రోగ ♦ భూత పీడితులైరి
దుష్టమానవులు వ ♦ ర్ధిష్ణులైరి
తే. పక్షివాహన మావంటి ♦ భిక్షుకులకు
శక్తిలేదాయె నింక నీవె ♦ చాటుమాకు ॥భూ॥ 26

టీక. భూష...దూర, అధికవిద్యావంతులు=ఎక్కువ విద్య నేర్చిన వారు, అప్రియోజకులైరి=పనికిమాలినవారైరి, పూర్ణశుంఠలు=ఎక్కువమూఢులు, సభాపూజ్యులైరి=సభలయందు పూజింపబడినవారైరి, సత్యవంతులమాట, జనవిరోధంబాయె=లోకులకు విరోధమయ్యెను, వదరుపోతులమాట=అవకతవకమాటలాడువారిమాటలు, వాసికెక్కె=మెప్పుబొందెను, ధర్మవాదనపరుల్=న్యాయమునుగూర్చి మాట్లాడువారు, దారిద్ర్యమొందిరి=బీదవారైరి, పరమలోభులు=మిక్కిలిపిసినిగొట్టులు, ధనప్రాప్తులైరి=ధనవంతులైరి, పుణ్యవంతులు, రోగభూతపీడితులైరి=రోగములచేతను, భూతములచేతను, బాధింపబడుచుండిరి, దుష్టమానవులు, వర్ధిష్ణులైరి=వృద్ధిపొందెడివారైరి, పక్షివాహన=గరుత్మంతుఁడు వాహనముగాఁ గలవాఁడా! మావంటిభిక్షుకులకు=నావలెనున్న యాచకులకు, శక్తిలేదాయె=సామర్థ్యములేకుండెను, ఇకనీవె, చాటుమాకు=మాకుఆశ్రియుండవు.

తా. ఓనరసింహా! ఎక్కువ విద్య నేర్చుకొన్నవారు అప్రియోజకులైరి మూఢులు సభాపూజ్యులైరి, నిజముచెప్పువారు లోకులకు విరోధులైరి, అవకతవకమాటలు చెప్పువారు మెప్పుపొందువారైరి. న్యాయము మాట్లాడువారుబీదలైరి, పిసినిగొట్టువారు భాగ్యవంతులైరి, పుణ్యాత్ములురోగపీడితులై దుష్టులు వృద్ధిబొందుచుండిరి, మాబోటి దీనులకు శక్తిలేదు, నీవే మాకు దిక్కు సుమా!

సీ. భుజబలంబునఁ బెద్ద ♦ పులుల జంపఁగవచ్చు
బాముకంఠముఁ జంక ♦ బట్టవచ్చు
బ్రహ్మరాక్షసకోట్లఁ ♦ బాఱఁదోలఁగ వచ్చు
మనుజుల రోగముల్ ♦ మాన్పవచ్చు
జిహ్వకిష్టముగాను ♦ జేదుఁ మ్రింగఁగవచ్చుఁ
బదనుఖడ్గముచేత ♦ నదుమవచ్చుఁ
గష్టమొందుచు ముండ్ల ♦ కంపలోఁజొరవచ్చుఁ
దిట్టుబోతులనోళ్లు ♦ కట్టవచ్చుఁ
తే. బుడమిలో దుష్టులకు జ్ఞాన ♦ బోధ తెలిపి
సజ్జనులఁజేయలేఁ డెంత ♦ చతురుఁడైన ॥భూ॥ 27

టీ. భూష...మార, భుజబలంబునన్=చేతిబలముచే, పెద్దపులులను, చంపఁగవచ్చున్, పాముకంఠమునన్=పాముమెడను, చంకపట్టవచ్చున్=చంకయందు పట్టుకొనవచ్చును, బ్రహ్మరాక్షసకోట్లన్=కోట్లకొలది బ్రహ్మరాక్షసులను, పాఱఁదోలఁగవచ్చున్=వెడలగొట్టవచ్చును, మనుజులరోగముల్=మనుష్యులజబ్బులు, మాన్పవచ్చున్, జిహ్వకు=నాలుకకు, ఇష్టముగాను, చేదున్=చేదువస్తువును, మ్రింగఁగవచ్చున్=తినవచ్చును, పదను ఖడ్గముచేతన్=వాఁడియగు కత్తిని, చేతితో, అదుమవచ్చున్=అణచవచ్చును, కష్టమొందుచు, ముండ్లకంపలోన్, చొరవచ్చున్=ప్రవేశింపవచ్చును, తిట్టుబోతుల నోళ్ళు=నోటికివచ్చినట్లు తిట్టువారినోళ్ళు, కట్టవచ్చున్=మూయవచ్చును, ఎంత చతురుఁడైన=ఎంత నేర్పరిదైనను, పుడమిలో=భూమియందు, దుష్టులకున్=దుర్మార్గులకు, జ్ఞానబోధ తెలిపి=జ్ఞానమునుబోధించి, సజ్జనులన్=మంచివారినిగ, చేయలేఁడు.

తా. ఓనరసింహా! భుజబలముచేత పెద్దపులులను చంపవచ్చు, పాము మెడను చంకతో పట్టుకొనవచ్చును, కోట్లకొలది బ్రహ్మరాక్షసులను పార

దోలవచ్చును, మానవుల రోగములు మాన్పవచ్చును, నాలుకకిష్టముగా చేదు తినవచ్చును. వాఁడియగు కత్తిని చేతితో అణచవచ్చును. బాధపడుచు ముండ్లకంపలో ప్రవేశింపవచ్చును. తిట్టువారలనోరులు కట్టవచ్చును. కానియెంత నేర్పరియైనను, దుష్టులకు జ్ఞానమిచ్చియనిచెప్పి మంచివారిగ చేయలేఁడు.

సీ. అవనిలోఁ గలయాత్ర ♦ లన్ని చేయఁగ వచ్చు
ముఖ్యుఁడై నదులందు ♦ మునుఁగవచ్చు
ముక్కుపట్టుక సంధ్య ♦ మొనసి వార్వఁగవచ్చు
దిన్నగా జపమాలఁ ద్రిప్పవచ్చు
వేదాల కర్థంబు ♦ విఱిచి చెప్పఁగవచ్చు
శ్రేష్ఠక్రతువు లెల్ల ♦ జేయవచ్చు
ధనము లక్షలకోట్ల ♦ దానమియ్యఁగ వచ్చు
నైష్ఠికాచారముల్ ♦ నడుపవచ్చు
తే. జిత్త మన్యస్థలంబునఁ ♦ జేరకుండ
నీపదాంభోజములయందు ♦ నిలుపరాదు ॥భూ॥ 28

టీ. భూష...దూర, అవనిలోఁగల=భూమిలోఁగల, యాత్రలు, అన్నిన్, చేయఁగవచ్చున్, ముఖ్యుఁడై=నీమముగలవాఁడై, నదులందు, మునుఁగవచ్చు=స్నానము చేయవచ్చును, మొనసి=పూనుకొని, ముక్కుపట్టుక, సంధ్యవార్వఁగవచ్చు=సంధ్యావందనము చేయవచ్చును, తిన్నగా జపమాలన్=జపముజేసుకొనుపూసలను, త్రిప్పవచ్చున్=త్రిప్పవచ్చును, వేదాలకు=వేదములకు, అర్థంబు విఱిచి=ప్రతిపదమును విడదీసి పదములకర్థము, చెప్పఁగవచ్చున్, శ్రేష్ఠక్రతువులు=మంచియజ్ఞములు, చేయవచ్చున్ ధనము, లక్షలకోట్ల=లక్షలు కోట్లు, దానమీయగవచ్చున్, నైష్ఠికాచారముల్=నిష్ఠతోఁగూడిన యాచారములు, నడపవచ్చున్=జరుపవచ్చును, చిత్తము, అన్యస్థలంబునన్=వేరొకచోటునకు, చేరకుండ, నీపదాంభోజములయందు=నీపాదపద్మములందు, నిలుపరాదు=నిలుపుటకు సాధ్యముకాదు.

తా. భూమిలోఁగల తీర్థయాత్రలన్నియు చేయవచ్చును. నియమముగల వాఁడై ముఖ్యమగునదులందు స్నానము చేయవచ్చును. పూనికతో సంధ్య వార్చవచ్చును. సరిగాజపమాలతో జపించవచ్చును. అన్ని వేదములలోని ప్రతి పదమునకర్థముఁజెప్పవచ్చును. మేలగు యాగములన్నియు చేయవచ్చును. కోట్లకొలది ధనము దానమీయవచ్చును. నిష్ఠతోఁగూడిన ఆచారములు జరుప వచ్చును. కాని, మనస్సును వేఱొకచోటికి పోకుండునట్లు నీపాదధ్యానము నందు నిశ్చలముగ నిలుప జాలము.

సీ. కర్ణయుగ్మమున నీ ♦ కథలు సోఁకినఁజాలు
పెద్దపోగుల జోళ్లు ♦ పెట్టినట్లు
చేతు లెత్తుచుఁ బూజ ♦ సేయఁగల్గినఁజాలు
దొరయఁగాఁ గడియాలు ♦ దొడిగినట్లు
మొనసి మస్తకముతో ♦ మ్రొక్కఁగల్గినఁ జాలు
జెలువమైన తురాయి ♦ జెక్కినట్లు
గళము నొవ్వఁగ నామ ♦ స్మరణ గల్గినఁ జాలు
వింతగాఁ గంఠీలు ♦ వేసినట్లు
తే. పూని నినుగొల్చుటే సర్వ ♦ భూషణంబు
లితర భూషణముల నిచ్చ ♦ గింపనేల ॥భూ॥ 29

టీ. భూష...దూర, కర్ణయుగ్మమున=రెండుచెవులయందు, నీకథలు, సోఁకినచాలు=పడినఁజాలును, పెద్దపోగులజోళ్ళు=చెవులకు ధరించు కుండలములజత, పెట్టినట్లు, చేతులెత్తుచుఁ, పూజసేయఁగల్గినచాలుఁ= పూజింపఁగల్గిన చాలును, దొరయఁగాఁ=అందముగ, కడియాలు, తొడిగి నట్లు=తొడిగికొనునటులే, మొనసి=పూని, మస్తకముతో=శిరస్సుతో, మ్రొక్కఁగల్గినచాలు=నమస్కరించిన సరిపోవును, చెలువమైన=అందమగు, తురాయి=తలకుధరించుకొను నగ, చెక్కినట్లు, గళము=కంఠము, నొవ్వగ=

బాధించునటుల, నామస్మరణ=పేరుస్మరించుట, కల్గిన చాలు, వింతగాన్, కంఠీలు=కంఠమాలలు, వేసినట్లు, పూని=ప్రయత్నించి, నిన్నున్, కొల్చుటే=సేవించుటయే, సర్వభూషణంబులు=సమస్తాలంకారములును, ఇతరభూషణములన్=ఇతరనగలను, ఇచ్ఛగింపనేల=కోరుటెందులకు?

తా. ఓనరసింహా! నీకథలు చెవులఁబడిన కుండలములు పెట్టుకొనినట్లే. చేతులెత్తి నిన్ను పూజించిన ముంజేతికంకణములు దొడిగికొనినట్లే. శిరస్సువంచి నీకు మ్రొక్కిన తురాయిధరించినట్లే. కంఠమునొచ్చునట్లు నీనామము స్మరించిన కంఠమాలలు వేసుకొనినట్లే కావున శ్రద్ధతో నిన్ను సేవించుటే సమస్తాలంకారములు నగును. ఆట్టిచో ఇతరనగ లనవసరములు.

సీ. భువనరక్షక నిన్నుఁ ♦ బొగడ నేరనినోరు
ప్రజకు గోచరమైన ♦ పాడుబొంద
సురవరార్చిత నిన్నుఁ ♦ జూడఁగోరని కనుల్
జలములోపల నెల్లి ♦ సరపుగుండ్లు
శ్రీ రమానాధిప నీకు ♦ సేవజేయని మేను
కూలి కమ్ముడుపోని ♦ కొలిమితిత్తి
వేడ్కతో నీకథల్ ♦ విననికర్ణములైనఁ
గఠిన శిలాదులఁ ♦ గలుగుతొలలు
తే. పద్మలోచన నీమీఁద ♦ భక్తిలేని
మానవుఁడు రెండుపాదాల ♦ మహిషమయ్య ॥భూ॥ 30

టీ. భూష...దూర, భువనరక్షక=లోకముల రక్షించువాఁడా! నిన్నున్, పొగడనేరని, నోరు, ప్రజకుగోచరమైన=మనుజులకు కనబడునట్టి, పాడుబొంద=పాడుగొయ్యి, సురవరార్చిత=దేవతలలో గొప్పవారిచే పూజింపఁబడువాఁడా! నిన్ను, చూడగోరనికనుల్=చూచుటకిష్టపడని కన్నులు, జలములోపల, నెల్లిసరపుగుండ్లు=నెల్లిసరపు గుండ్లవంటివి, శ్రీరమాధిపా=

లక్ష్మీదేవికి భర్తయైనవాఁడా! నీకుసేవచేయనిమేను=నిన్నుపూజింపని శరీరము, కూఁకికి, అమ్ముడుపోని=అమ్మకముకానటువంటి, కొలిమితిత్తి=కమ్మరి కొలిమిలోని తోలుతిత్తి, వేడ్కతో=సంతోషముతో, నీకథల్, విననికర్ణములైన=వినని చెవులయినచో, కఠినశిలాదులకు=కఠినమైనరాళ్ళు మొదలగు వానియందు, కలుగు, తొలలు=రంధ్రములు, పద్మలోచనా=తామరపువ్వుల వంటి నేత్రములు గలవాఁడా! నీమీఁద, భక్తిలేని, మానవుఁడు, రెండుపాదాల=రెండుకాళ్ళుగల, మహిషము య్యా=దున్నపోతు సుమా!

తా. ఓనరసింహా! లోకములపాలించువాఁడా! నిన్నుపొగడనినోరు పాడుగుంటవంటిది. నిన్నుచూడఁగోరని కన్నులు నీటియందలి నెల్లిసరపు గ్రుడ్లవంటివి. నిన్ను పూజింపలేని శరీరము పనికిరాలిన కొలిమితిత్తివంటిది. నీకథలు వినని చెవులు కఠినరాళ్ళయందలి తొలలవంటివి. నీయందుభక్తిలేని మానవుడు రెండుకాళ్ళదున్నపోతువంటివాఁడు.

సీ. అతివిద్య నేర్చుట ♦ యన్నవస్త్రములకే
పశుల నార్జించుట ♦ పాలకొఱకే
సతిని పెండ్లాడుట ♦ సంసార సుఖముకే
సుతులఁ బోషించుట ♦ గతులకొఱకె
సైన్యముల్ గూర్చుట ♦ శత్రుభయమునకె
సాము నేర్చుట లెల్ల ♦ చావుకొఱకె
దాన మిచ్చుటయు ముం ♦ దటి సంచితమునకే
ఘనముగాఁ జదువుట ♦ కడుపుకొఱకె
తే. యితరకామంబు గోరక ♦ సతతముగను
భక్తి నీయందు నిలుపుట ♦ ముక్తికొఱకె ॥భూ॥ 32

టీ. భూష...దార, అతివిద్య నేర్చుట=బాగుగా చదువుకొనుట, అన్నవస్త్రములకే, పశులను=పశువులను, ఆర్జించుట=సంపాదించుట, పాలకొరకె=పాడినిమిత్తమే, సతిని=స్త్రీని, పెండ్లాడుట, సంసారసుఖ

ముకే=సంసారమందలి సుఖములనిమిత్తమే, సుతులఁ=కుమారులను, పోషించుట=పెంచుట, గతులకొరకె=పున్నామనరకము దాటుటకే, సైన్యముల్=సేనలు, కూర్చుట=ప్రోవుచేయుట, శత్రుభయమునకే=విరోధుల భయము లేకుండుటకే, సాముసేర్చుటలు=కత్తికట్టలు త్రిప్పుట నేర్చుకొనుట, ఎల్లఁ, చావుకొరకే, దానముయిచ్చుటయు, ముందటి=రాబోవు, సంచితమునకే=పుట్టుకయందలి ఫలమునకే, ఘనముగాఁ, చదువుట, కడుపుకొరకే=కడుపును పోషించుకొనుటకే, ఇతరకామంబు=ఇతరకోరికలు, కోరక, సతతముగను=ఎల్లప్పుడును, భక్తి, నీయందు, నిలుపుట, ముక్తికొరకె=మోక్షము నిమిత్తమే.

తా. ఓనరసింహా! ఎక్కువగా చదువుకొనుట అన్నవస్త్రములకును, పశువులను సంపాదించుట పాలకును, పెండ్లాడుట సంసారసుఖములకును, కుమారులను పెంచుట ముక్తికొరకున్ను, సేనప్రోగుచేయుట శత్రుభయము నుండి తప్పించుకొనుటకును, సాదనము నేర్చుకొనుట చావునకును, దానము చేయుట రాబోవు జన్మసుఖములకున్ను, విస్తారము చదువుట కడుపుకొరకున్ను, ఇతరకోరికలు కోరక నిత్యము నీయందు భక్తినిలుపుట మోక్షము నిమిత్తమే.

సీ. ధరణిలో వేయేండ్లు • తనువు నిల్వఁగబోదు
ధనమెప్పటికి శాశ్వ • తంబు గాదు
దారసుతాదులు • తనవెంట రాలేరు
భృత్యులు మృతిని ద • ప్పింపలేరు
బంధుజాలము తన్ను • బ్రతికించుకోలేరు
బలపరాక్రమమేమి • పనికిరాదు
ఘనమైన సకలభో • గ్యంబెంతగల్గియు
గోచిమాత్రంబైనఁ • గొనుచుఁబోఁడు

తే. వెఱ్ఱికుక్కల భ్రమలన్ని ♦ విడిచి నిన్ను
భజన జేసెడివారికిఁ ♦ బరమసుఖము ॥భూ॥ 32

టీ. భూప...దూర, ధరణిలో=భూమియందు యేండ్లు, తనువు=శరీరము, నిల్వఁగ బోఁదు=నిలచియుండదు, ధనము, ఎప్పటికిని, శాశ్వతంబు గాదు=స్థిరముగాదు, దార=భార్యయు, సుతాదులు=బిడ్డలు మొదలగువారు, తనవెంట, రాలేరు, భృత్యులు=సేవకులు, మృతిని=మరణమును, తప్పింప లేరు=తొలగింపలేరు, బంధుజాలము=చుట్టములగుంపు, తన్ను బ్రతికించుకో లేరు, బలపరాక్రమములు=బలశౌర్యములు, ఏమిపనికి రాదు=ఎంతమాత్రముప యోగింపవు, ఘనమైన=గొప్పదియగు, సకలభాగ్యములు=సమస్తసంపదలు, ఎంతగల్గియు=ఎన్నియున్నను, గోచిమాత్రంబైనన్=గోచిదైనను, కొనిచు పోఁడు=తీసుకొనిపోలేఁడు, వెఱ్ఱికుక్కలభ్రమలు=వెఱ్ఱికుక్కలవంటి ఆలో చనలు, అన్ని, విడిచి, నిన్ను, భజనజేసెడివారికిన్=సేవించువారలకు, పర మసుఖము=శాశ్వతసౌఖ్యమగును.

తా. ఓనరసింహా! భూమిలో నెన్నేండ్లు శరీరము నిలువదు. ధనము స్థిరముగాదు. భార్యాపుత్రాదులు చనిపోవునప్పుఁడు వెంటరారు. సేవకులు చావుతప్పింపలేరు. చుట్టములు తన్నుబ్రతికింపలేరు. బలశౌర్యములేమాత్రము పనికిరావు. ఎంతసంపదగల్గియున్నను గోచిదైన వెంటతీసుకొని వెళ్ళలేఁడు. కావున వెఱ్ఱికుక్కలవలె పిచ్చిభ్రమలు వదలి నిన్ను భజించువారలకు శాశ్వత సౌఖ్యము గల్గును.

సీ. నరసింహా నాకు దు ♦ ర్ణయములే మెండాయె
సుగుణ మొక్కటిలేదు ♦ చూడఁజనిన
యన్యకాంతలమీఁద ♦ నాశ మానఁగలేను
ఒరుల క్షేమముఁజూచి ♦ యోర్వలేను
ఇటువంటి దుర్బుద్ధు ♦ లిన్ని నాకున్నవి
నేను జేసెడి వన్ని ♦ నీచకృతులు

నావంటి పాపిష్ఠి ♦ నరుని భూలోకాన
బుట్టజేసితి వేల ♦ భోగిశయన
తే. అబ్జదళనేత్ర నాతండ్రి ♦ వైనఫలము
నేరములు గాంచి రక్షింపు ♦ నీవెదిక్కు ॥భూ॥ 33

టీక. భూష...దూర, నరసింహ, నాకు, దుర్ణయములే=చెడుపనులే, మెండాయె=ఎక్కువయ్యెను, మూఢజనిన=మూఢబోగ, సుగుణము=మంచిగుణము, ఒక్కటిలేదు, అన్యకాంతలమీదన్=పరస్త్రీలపైని, ఆశ=కోర్కె, మానఁగలేను, ఒరుల క్షేమము చూచి=ఇతరుల కుశలముచూచి, ఓర్వలేను, ఇటువంటి దుర్బుద్ధులు, ఇన్ని నాకు ఉన్నవి, నేనుఁజేసెడివి=నేను చేయుపనులు, అన్ని, నీచకృతులు=చెడుపనులు, నావంటి పాపిష్ఠినరుని=నాబోటి పాపిని, భూలోకానన్=భూమియందు, పుట్టచేసితివి, ఏల=ఎందుకు, భోగిశయన=పాముమీద పరుండువాఁడా! అబ్జదళనేత్ర=తామరపూవురేకులవంటి కన్నులుగలవాఁడా! నాతండ్రివైన=నాయొక్క తండ్రివైనందులకు, నేరములు=తప్పులు, కాచి=క్షమించి, రక్షింపు=కాపాడుము, నీవెదిక్కు=నీవే కాపాడు రక్షకుఁడవు.

తా. ఓనరసింహా! నాకు చెడ్డగుణములే ఎక్కువగానున్నవి. చూడగా మంచిగుణమొక్కటియైనను లేదు. పరస్త్రీలపై కోర్కె విడువలేను. ఇతరుల క్షేమముఁజూచి సహింపలేను. ఇట్టి చెడ్డగుణములున్నవి, నేను చేయునవి చెడుపనులే! నాబోటి పాపుని భూమియందేల పుట్టించితివి, నీవు నా తండ్రివైనందుకు నాతప్పులు క్షమించి కాపాడుము. నీవే రక్షకుఁడవు.

సీ. ధీరతఁ బరుల నిం ♦ దింప నేర్చితిఁ గాని
తిన్నగా నినుఁ బ్రస్తుతింపనైతిఁ
బొరుగు కామినులందు ♦ బుద్ధి నిల్పితిఁ గాని
నిన్ను సంతతము ♦ ధ్యానింపనైతిఁ

పెరికి ముచ్చటలైన ♦ మురిసి వింటిని గాని
దెంచి నీకథ లాల ♦ కించనైతిఁ
గౌతుకంబునఁ బాత ♦ కము గడించితిఁగాని
హెచ్చుపుణ్యము సంగ్ర ♦ హింపనైతి
తే. నవనిలో నేను జన్మించి ♦ నందు కేమి
సార్థకము గానరాదాయె ♦ స్వల్పమైన ॥భూ॥ 34

టీక. భూష...దూర, ధీరతన్=ధైర్యముతో, పరులన్=ఇతరులను, నిందింపనేర్చితిన్=దూషింపనేర్చి, కాని, నిన్ను తిన్నగా, ప్రస్తుతింపనైతిన్=పొగడలేనైతిని, పొరుగుకామినులందు=ఇతరస్త్రీలయందు, బుద్ధినిల్పితికాని=మనస్సుంచితిగాని, నిన్ను, సంతతము, ధ్యానింపనైతిన్=తలచుకోనైతిని, పెరికిముచ్చటలు=ఇతరులను గురించినమాటలు, ఐన=ఐనవి, మురిసి=సంతసించి, వింటినిగాని, దెంచి, నీకథలు, ఆలకించనైతిన్=వినకపోయితిని, కౌతుకంబునన్=సంతోషముతో, పాతకమున్=పాపమును, గడించితికాని=సంపాదించితినేకాని, హెచ్చుపుణ్యము=ఎక్కువగుపుణ్యము, సంగ్రహింపనైతిన్=గడింపనైతిని, అవనిలో, నేను, జన్మించినందుకు=పుట్టినందుకు, ఏమిసార్థకము=ఏప్రయోజనమును, స్వల్పమైనను, కానరాదాయె=కనబడదయ్యెను.

తా. ధైర్యముచే నితరుల నిందించితినేకాని నినుపొగడనైతిని. పరస్త్రీలయందు బుద్ధినిల్పితినికాని నిను సదా తలచనైతిని. యితరుల మాటలు సంతోషముతో వింటినేకాని నీకథలాలకించనైతిని. సంతోషముతో పాపము గడించితినేకాని పుణ్యము గడింపనైతిని. నేను భూమిలో పుట్టినందు కేమాత్రపు ప్రయోజనమును కనబడదాయెను.

సీ. అంత్యకాలమునందు ♦ నాయాసమున నిన్ను
దలఁతునో దలఁపనో ♦ దలఁతు నిపుడె
నరసింహ నరసింహ ♦ నరసింహ లక్ష్మీశ
దానవాంతక కోటి ♦ భానుతేజ

గోవింద గోవింద ♦ గోవింద సర్వేశ
పన్నగాధిపశాయి ♦ పద్మనాభ
మధువైరి మధువైరి ♦ మధువైరి లోకేశ
నీలమేఘశరీర ♦ నిగమవినుత
తే. ఈవిధంబున నీనామ ♦ మిష్టముగను
భజనసేయుచునుందు ♦ నాభావమందు॥భూ॥ 35

టీ. భూష...దూర, అంత్యకాలమునందుఁ=చనిపోవు కాలమునందు ఆయాసమున, నిన్నుఁ, తలఁతునో=స్మరింతునో, తలఁపనో, ఇపుడె, తలతుఁ=ధ్యానింతును, నరసింహ=నరునియొక్కయు సింహముయొక్కయు ఆకారముగల మూర్తిగలవాఁడా! నరసింహ, నరసింహ, లక్ష్మీశ=లక్ష్మీదేవికి భర్తయైనవాఁడా! దానవాంతక=రాక్షసులను సంహరించినవాఁడా! కోటిభాను తేజ=కోటిసూర్యుల కాంతిగలవాఁడా! గోవింద=భూమినిగాని గోవునుగాని, స్వర్గమునుగాని వేదమునుగాని పొందెడువాఁడా! గోవింద, గోవింద సర్వేశ=సమస్తమునకు ప్రభువైనవాఁడా! పన్నగాధిపశాయి=పాములకు ప్రభువైన ఆదిశేషునిపై పరుండువాఁడా! పద్మనాభ= పద్మము బొడ్డుగా గలవాఁడా! మధువైరి=మధువను రాక్షసునకు శత్రువైనవాఁడా! మధువైరి, మధువైరి, లోకేశ=లోకములకు పాలకుఁడా! నీలమేఘశరీర=నల్లని మేఘమువంటి ఛాయగల శరీరముగలవాఁడా! నిగమవినుత=వేదములచే పొగడబడినవాఁడా! ఈవిధంబున, నీనామము, ఇష్టముగను=ప్రీతితో, నాభావమందు=నామనస్సునందు, భజనసేయుచు, ఉందుఁ=ఉండెదను.

తా. ఓనరసింహా! నేనుచనిపోవు కాలమునందాయాసముచే నిన్నుతలపఁగలనో లేనో కావున యిప్పుడే తలచుచున్నాను. లక్ష్మీశ, దానవాంతక, కోటిభానుతేజ! గోవింద! సర్వేశ! శేషశాయి! పద్మనాభ! మధువైరి! లోకేశ! నీలమేఘశ్యామ! నిగమవినుత! అనుచు నీనామమును ప్రీతిపూర్వకముగా నామనసునందు భజన సేయుచుందును.

సీ. ఆయురారోగ్య పు ♦ త్రార్థ సంపదలన్ని
కలుగఁజేసెడి భార ♦ కర్తవీవె
చదువు లెస్సఁగ నేర్పి ♦ సభలో గరిష్ఠాధి
కారమొందించెడి ♦ ఘనుఁడవీవె
నడక మంచిది పెట్టి ♦ నరులు మెచ్చెడునట్టి
పేరు రప్పించెడి ♦ పెద్దవీవె
బలువైన వైరాగ్య ♦ భక్తిజ్ఞానములిచ్చి
ముక్తి బొందించెడు మూర్తివీవె
తే. అవనిలో మానవుల కన్ని ♦ యాసలిచ్చి
వ్యర్థులనుజేసి తెలిపెడి ♦ వాఁడవీవె ॥భూ॥ 36

టీ. భూష...దూర, ఆయురారోగ్య=జీవించుట రోగములు లేకుండుట, పుత్ర=కొడుకులును, అర్థ=ధనమును, సంపదలు=భాగ్యములు, అన్ని, కలుగఁజేసెడి, భార=బాధ్యతగల, కర్తవు=అధిపతివి, ఈవె=నీవే, చదువున్, లెస్సఁగ నేర్పి=బాగుగా నేర్పి, సభలో, గరిష్ఠాధికారమొందించెడి=అధికమయిన గొప్పతనము కలుగఁజేసెడి, ఘనుఁడవీవె=గొప్పవాఁడవీవె, నడక=ప్రవర్తన, మంచిది పెట్టి, నరులు, మెచ్చెడునట్టి=పొగడునట్టి, పేరురప్పించెడి=కీర్తి తెప్పించెడి, పెద్దవీవె=పెద్దవాడవునీవె, బలువైన=అధికమైన, వైరాగ్య=ఏవస్తువునందును కోరిక లేకుండుట, భక్తి=నిశ్చలబుద్ధి, జ్ఞానములు=వివేకములు, ఇచ్చి=కలిగించి, ముక్తిన్=మోక్షమును, పొందించెడు=కలుగఁజేసెడు, మూర్తివి=ఆకారము గలవాఁడవు, ఈవె, అవనిలో=భూమియందు, మానవులకు=మనుష్యులకు, అన్ని ఆసలు + ఇచ్చి=అన్ని కోర్కెలు పుట్టించి, వ్యర్థులనుజేసి=కోర్కెలు పొందినవారిగాఁజేసి, తెలిపెడువాడవు=తోపించేవాడవు, ఈవె=నీవే!

తా. ఓనరసింహా! ఆయువు, ఆరోగ్యము, పుత్రులు, భాగ్యము మొదలగుసంపదలు కలిగించు నాథుఁడవు, విద్య బాగుగా నేర్పి సభలలో మెప్పుగ

బూదిని=బూడిదను, నుదుటను=ముఖమునందు, పూసికొనిన=ఏమి?, శంభుఁ=ఈశ్వరుని, ఒంపక=తెలుసుకొనక, శైవజనుఁడు=శివభక్తుఁడు, కాఁడు=కాజాలఁడు, కాషాయవస్త్రములు=జేగురుబట్టలు, కట్టి, కప్పినఁ=కప్పకొనినను, ఏమి, ఆశ=కోర్కెలు, పోవక=వదలక, యతివరుండుకాడు=మునికాజాలఁడు, ఇట్టిలౌకిక వేషాలు=ఇట్టి లోకాచారసంబంధమైన వేషములు, కట్టుకొనినఁ=వేసుకొనినప్పటికిని, గురుని=గురువుని, చెందక=చేరక, సత్ + ముక్తి=సన్ముక్తి=శ్రేష్ఠమగు మోక్షము, దొరకబోదు=దొరకజాలదు.

తా. ఓనరసింహస్వామీ ! బ్రహ్మజ్ఞానము నొందినవాఁడే బ్రాహ్మణుఁడుగాని, జందెమున్నంతనే కాడు విష్ణుమహిమ నెరిగినవాడే వైష్ణవుడుగాని నామములు పెట్టినంతనేకాడు. ఈశ్వరమహిమ తెలిసినవాడే శివభక్తుడుగాని బూడిదపూసికొనినంతనేకాడు. ఆశవిడచిననే సన్యాసియగుగాని ఎఱ్ఱరంగుగుడ్డలు కంపినంతనే కాడు. ఇట్టిమాయవేషమువేసినంతనే గురుబోధ తెలియకుండ మోక్షమురాదు.

సీ. నరసింహ నేనిన్ను ♦ నమ్మినందుకుఁజాల
నెనరు నాయందుంచు ♦ నెమ్మనమున
నన్నివస్తువులు ని ♦ న్నడిగి వేసట పుట్టె
నింకనైన గటాక్ష ♦ మియ్యవయ్య
సంతసంబుననన్ను ♦ స్వర్గమందేయుంచు
భూమియందే యుంచు ♦ భోగిశయన
నయమునుగా వైకుంఠ ♦ నగరమందేయుంచు
నరకమందే యుంచు ♦ నళిననాభ

తే. ఎచట నన్నుంచినఁగాని ♦ యెపుడునిన్ను
మఱచిపోకుండ నీనామ ♦ స్మరణనొసఁగు ॥భూ॥ 39

టీ. భూప...దూర, నరసింహా! నేఁ=నేను, నిన్ను, నమ్మినందులకు, నాయందు=నాయెడ, నెమ్మనమునఁ=మనస్సునందు, చాలనెనరు=ఎక్కువప్రేమ, ఉంచు=ఉంచుము, అన్నివస్తువులు, నిన్ను, అడిగి, వేసటపుట్టెఁ=అలసటపుట్టెను, ఇంకనైనఁ=ఇకమీదనైనను, కటాక్షము=దయ, ఇయ్యవయ్య=చూపవయ్యా! సంతసంబునఁ=సంతోషముతో, నన్ను, భోగిశయన=పాముమీద పరుండేవాఁడా! స్వర్గమందేయుంచు, భూమియందేయుంచు, నళిననాభ=నాభియందు పద్మముగలవాఁడా! నయముగా=నేర్పుతో, వైకుంఠనగరమందేయుంచు=వైకుంఠపురములోనే యుంచుము, నరకమందేయుంచు, ఎచట=ఏలోకమందు, నన్ను, ఉంచినంగాని=ఉంచినప్పటికిని, ఎప్పుడు, నిన్నుమరచిపోకుండ, నీ=నీయొక్క, నామస్మరణఁ=నామమును దలచుట, ఒసగు=ఇమ్ము.

తా. ఓనరసింహా! నేనునిన్ను నమ్మినందులకు నాయందెక్కువప్రేమనుంచుము. అన్ని వస్తువులు నిన్నడిగి విసుగుజెందితిని. ఇఁకనైన దయచూపుము. నన్నుసంతోషముతో స్వర్గమందుగాని, భూమియందుగాని, వైకుంఠనగరమునగాని, నరకమునగాని, యుంచుము. నన్నెక్కడుంచినను సదా నిన్ను మఱచిపోకుండ నీనామస్మరణ జేయునట్లుగ జ్ఞానమునిమ్ము.

సీ. దేహమున్నవఱకు ♦ మోహసాగరమందు
మునుఁగుచుందురు శుద్ధ ♦ మూఢజనులు
సలలితైశ్వర్యముల్ ♦ శాశ్వతంబనుకొని
షడ్భ్రమలను మాన ♦ జాలరెవరు
సర్వకాలము మాయ ♦ సంసార బద్ధులై
గురుని కారుణ్యంబు ♦ గోరుకొనరు
జ్ఞానభక్తి విరక్తు ♦ లైన పెద్దలఁ జూచి
నిందజేయక తాము ♦ నిలువలేరు

తే. మత్తులైనట్టి దుర్జాతి ♦ మనుజులెల్ల
నిన్నుఁ గనలేరు మొదటికే ♦ నీరజాక్ష ॥భూ॥ 40

టీ. భూష.. దూర, శుద్ధ మూఢజనులు=బొత్తిగా తెలివితక్కువ నరులు, దేహమున్నవఱకు=శరీరమున్నంతవరకు, మోహసాగరమందు=మమకారమను సముద్రమునందు, మునుగుచుందురు, సలలితైశ్వర్యములు=చక్కని భాగ్యములు, శాశ్వతంబు=నశించనివి, అనుకొని, షడ్భ్రమలను=ఆరువికారములు, మానఁజాలరు=విడువలేరు, ఎవరు=ఎవ్వరును, సర్వకాలము=ఎల్లప్పుడు, మాయసంసారబద్ధులై=మాయతోఁగూడిన సంసారమున తగులుకొన్నవారై, గురునికారుణ్యంబుఁ=సద్గురుని దయను, కోరుకొనరు=వాంఛింపరు, జ్ఞాన=జ్ఞానము, భక్తి=భక్తి, విరక్తులు=ఆసక్తిలేనివారు, ఐన పెద్దలను, చూచి, నిందఁజేయక=నిందింప, తాము, నిలువలేరు=ఉండజాలరు, నీరజాక్ష=పద్మనేత్ర, మత్తులైనట్టి=తమ్ముతాము తెలియక మదించినట్టి, దుర్జాతి=దుర్మార్గులయిన, మనుజులు, ఎల్లన్=అందరు, నిన్నున్=నిన్ను, మొదటికే=అసలే, కనలేరు=చూడలేరు.

తా. ఓనరసింహా! అజ్ఞానులైన నరులు దేహమున్నంతవఱకు మోహమను సముద్రములో మునిగి తేలుచుందురు. చక్కని భాగ్యములు స్థిరములనుకొని కామ క్రోధ లోభ మద మాత్సర్యములగు ఆరుగుణంబులను వదలరు. సదా మాయసంసారమున తగుల్కొని సద్గురుని చేరరు. భక్తిజ్ఞానవైరాగ్యములనెఱింగిన పెద్దలనుజూచి నిందింపకుండ యుండజాలరు. తమ్ముతా మెఱుగక మదించినట్టి దుర్మార్గులయిన మనుష్యులు నిన్నసలే తెలుసుకొనజాలరు.

సీ. ఇలలోన నేజన్మ ♦ మెత్తినప్పటినుండి
బలుగడించితినయ్య ♦ పాతకములు
తెలిసి చేసితిఁ గొన్ని ♦ దెలియఁజాలక చేసి
బాధనొందితినయ్య ♦ పద్మనాభ

అనుభవించెడు నప్పు • డతి ప్రయాసంబంచుఁ
ప్రజలుచెప్పఁగఁజాల • భయముగలిగె
నెగిరిపోవుటకు నై • యే యుపాయంబై నఁ
జేసి చూతమటన్నఁ • జేతకాదు
తే. సూర్య శశినేత్ర నీచాటుఁ • జొచ్చినాఁడ
కలుషములు ద్రుంచి నన్నేలు • కష్టమనక ॥భూ॥ 41

టీ. భూష...దూర, ఇలలోనన్=భూమియందు, నే=నేను, జన్మమెత్తినప్పటినుండి=పుట్టినప్పటినుండి, పలుపాతకములు=అనేకపాపములు, గడించితినయ్య=కూడబెట్టితిని, కొన్ని=కొన్ని, పాపములు, తెలిసిచేసితిన్=ఎఱిఁగియుండియే చేసితిని, కొన్ని, తెలియజాక=తెలిసికొనక, చేసి, బాధన్=కష్టమును, ఒందితినయ్య=పొందితినిసుమా! పద్మనాభ, అనుభవించెడునప్పుడు = ఆకష్టములుపొందునప్పుడు, అతిప్రయాసంబంచు=మిక్కిలికష్టమనుచు, ప్రజలు=లోకులు, చెప్పఁగన్=చెప్పఁగా, చాలభయముగలిగె=ఎక్కువభయముపుట్టినది, ఎగిరిపోవుటకునై=ఆకాశమునం దెగిరిపోవుటకు, ఏయుపాయంబైనన్=సాధనమేదైన, చేసి చూతమటన్నన్=చేయుదమన్న, చేతకాదు, సూర్యశశినేత్ర=సూర్యచంద్రులు నేత్రములుఁగాఁగలవాఁడా! నీచాటున్ చొచ్చినాఁడ=నీమఱుఁగు చేరియుంటిని, కలుషములు=పాపములు, త్రుంచి=పోఁగొట్టి, నన్ను, కష్టమనక=భారమనితలఁపక, ఏలు=కాపాడుము.

తా. ఓనరసింహా! నేనుభూమిమీఁద పుట్టినప్పటినుండియు తెలిసికొన్నియు, తెలియకకొన్నియు, ననేకపాపములు చేసియుంటిని. అనేకకష్టములుపొందితిని. లోకు లాకష్టములుపొందుట చాల ప్రయాసముకలుగునని చెప్పగా విని మిక్కిలి భయముపొందితిని. ఈభయమునకై యాకాశమున కెగరిపోవుట కేయుపాయమైననుచేసి చూతమన్న చేతఁగాదు. సూర్యచంద్రులు నేత్రములుగాగల్గిన నీశరణుజొచ్చితిని. నాకలుషములు పోఁగొట్టి కష్టమనితలఁపక నన్ను కాపాడుము.

సీ. తాపసార్చిత నేను ♦ పాపకర్ముఁడనంచు
నాకు వంకలఁబెట్టఁ ♦ బోకుజుమ్మి
నాఁటికి శిక్షలు ♦ నాకు చేయుటకంటె
నేఁడు సేయుము నీవు ♦ నేస్తమనక
అతిభయంకరులైన ♦ యమదూతలకు నన్ను
నొప్పగింపకుమయ్య ♦ యురగశయన
నీదాసులనుబట్టి ♦ నీవు దండింపంగ
వద్దువద్దన రెంత ♦ పెద్దలైనఁ
తే. దండ్రివై నీవు పరపీడఁ ♦ దగులజేయ
వాసిగల పేరు కపకీర్తి ♦ వచ్చునయ్య ॥భూ॥ 42

టీ. భూష...దూర, తాపసార్చిత=మునులచేఁపూజింపబడినవాఁడా! నేను, పాపకర్ముఁడు=పాపపుపనులుచేయువాఁడు, అటంచు నాకు, వంకలన్ = తప్పులను, పెట్టఁబోకుజుమ్మి=పెట్టఁబోకుసుమా! నాఁటికి=ఆదినమునకు (చచ్చిపోయినతరువాత) నాకు, శిక్షలుఁచేయుటకంటె=దండించుటకంటె, నేఁడు=ఈరోజున, నీవు, నేస్తమనక=స్నేహమనితలపక, చేయుము=దండనచేయుము, ఉరగశయన=పాముమీదపవళించువాఁడా! అతిభయంకరులయిన=మిక్కిలిభయముపుట్టించువారలయిన, యమదూతలకు, నన్నున్ ఒప్పగింపకుమయ్యా=వశపరుపకుముతండ్రీ! ఎంతపెద్దలైనను=ఎట్టిపెద్దమనుష్యులయినను, నీవు, నీదాసులన్=నీసేవకులను, పట్టి=పట్టుకొని, దండింపంగ=శిక్షింపుచుండగా, వద్దువద్దనరు=దండించవద్దనిచెప్పరు, నీవు, తండ్రివియై=నాకురక్షకుఁడవై, పరపీడన్=ఇతరులచేతబాధలు, తగులఁజేయ=కల్గింపజేసినచో, వాసిగల=కీర్తిగలిగిన, పేరును, అపకీర్తి=చెడ్డపేరు, వచ్చునయ్యా=వచ్చునుతండ్రీ!

తా. ఓనరసింహా! మునీశ్వరులచే పూజింపఁబడినవాఁడా! నేను పాపకర్ముఁడనని వంకఁబెట్టకుము. నామరణాంతమున శిక్షించుటకంటె నా

యందు ప్రియమును జూపక ఈరోజునసే శిక్షింపుము. అతిభయంకరులయిన యమకింకరులకు నన్ను వశపరుపకుము ఎంత పెద్దమనుష్యులయినను, నీవు నీ సేవకులను దండింపుచుండగా వద్దని చెప్పరు. నిపురత్నుఁడవై యితరులచే బాధలను గలుగఁజేసినచో కీర్తిగల నీపేరునకు, అపకీర్తి వచ్చును.

సీ. ధరణిలోపల నేను ♦ తల్లిగర్భమునందు
బుట్టినప్పటినుండి ♦ పుణ్యమెఱుఁగ
నేకాదశీవ్రతం ♦ బెన్నఁడుండఁగలేదు
తీర్థయాత్రలకైనఁ ♦ దిరుగలేదు
పారమార్థికమైనఁ ♦ పనులు సేయఁగలేదు
భిక్షమొక్కనికైనఁ ♦ బెట్టలేదు
జ్ఞానవంతులకైనఁ ♦ బూని మ్రొక్కఁగలేదు
ఇతరదానములైన ♦ నియ్యలేదు
తే. నళిన దళనేత్ర నిన్ను నే ♦ నమ్మినాను
జేరి రక్షింపవే నన్ను ♦ శీఘ్రముగను ॥భూ॥ 43

టీ. భూమ...దూర, ధరణిలోపలన్=భూమియందు, నేను, తల్లిగర్భమునందున్=తల్లికడుపునందు, పుట్టినప్పటినుండి=పుట్టినది మొదలు, పుణ్యము=మంచిపని చేయుటచేవచ్చు ఫలము, ఎఱుఁగన్=ఎఱుఁగను, ఏకాదసీవ్రతంబు=ఏకాదశియను మహావ్రతము, తీర్థయాత్రలకు ఐనన్=పుణ్యస్థలములకైనను, తిరుగలేదు=వెళ్ళలేదు, పారమార్థికమైనపనులు=పుణ్యమునిచ్చుపనులు, సేయఁగలేదు=చేయలేదు, ఒక్కనికైనన్, భిక్షము=ముష్టి, పెట్టలేదు, జ్ఞానవంతులకు=జ్ఞానము తెలిసినవారికి, ఐనన్=అయినప్పటికిని, పూని=బుద్ధిపూర్వకముగా, మ్రొక్కఁగలేదు=నమస్కరింపలేదు, ఇతరదానములైన ఇయ్యలేదు, నళినదళనేత్ర=పద్మరేకులవంటి నేత్రములు గలవాఁడా! నిన్ను, నే, నమ్మినాను=నమ్ముకొని యున్నాను, నన్ను, శీఘ్రముగన్=వేగముగ చేరి=సమీపించి, రక్షింపవే=కాపాడుమా!

తా. ఓనరసింహా! నేను భూమియందు తల్లిగర్భమునుండి పుట్టినది మొదలు పుణ్యపుపనులు చేయలేదు ఏకాదశీవ్రతంబుండలేదు ఏపుణ్యస్థలము, లకును పోలేదు పుణ్యమునిచ్చు పనులుచేయలేదు ఒకనికైనను భిక్షముపెట్ట లేదు పండితులకు నమస్కరింపలేదు ఏయితరదానములైనను చేయలేదు నేను నిన్ను నమ్మినాను శీఘ్రముగా సమీపించి నన్ను కాపాడుము.

సీ. అడవిపక్షుల కెవ్వఁ ♦ డాహార మిచ్చెను
మృగజాతి కెవ్వఁడు ♦ మేఁతఁబెట్టె
వనచరాదులకు భో ♦ జన మెవ్వఁడిప్పించె
జెట్లకెవ్వఁడు నీళ్ళు ♦ చేఁదిపోసె
స్త్రీలగర్భంబున ♦ శిశువు నెవ్వఁడు పెంచె
ఫణుల కెవ్వఁడు పోసెఁ ♦ బరగ బాలు
మధుపాళి కెవ్వఁడు ♦ మకరంద మొసరించె
బసుల కెవ్వఁడొసంగెఁ ♦ బచ్చిపూరి
తే. జీవకోట్లను బోషింప ♦ నీవె కాని
వేఱె యొకదాత లేఁడయ్య ♦ వెదకిచూడ ॥భూ॥ 44

టీ. భూష...దూర, అడవిపక్షులకు=అడవిలోనుండు పక్షులకు, ఎవ్వఁడు, ఆహారము=తిండి, ఇచ్చెన్=ఇచ్చెను? మృగజాతికి=జంతువులకు, ఎవ్వఁడు, మేఁతఁబెట్టె=మేతను కల్పించెను, వనచర + ఆదులకు=వనచరాదులకు=అడవులలో సంచరించు కోతులు మొదలగువాటికి, భోజనము=ఆహారము, ఎవ్వఁడు, ఇప్పించెన్=ఇచ్చునట్లుచేసెను, చెట్లకు, ఎవ్వఁడు, నీళ్ళు, చేఁది=తోడి, పోసె=పోసెను, స్త్రీలగర్భంబున శిశువున్=స్త్రీలకడుపుల యందలి బిడ్డను, ఎవ్వఁడు, పెంచె, ఫణులకు=పాములకు, ఎవ్వఁడు, పరఁగన్=ఒప్పేటట్టు, పాలుపోసెన్=పాలుపోసెను, మధుపాళికి=తుమ్మెదల గుంపునకు, ఎవ్వఁడు, మకరందము=తేనె, ఒసరించెన్=కూర్చెను, పశులకు= పశువులకు, ఎవ్వఁడు, ఒసంగెన్=ఇచ్చెను, పచ్చిపూరి=పచ్చనిగడ్డిని, జీవ

కోట్లను=ప్రాణిసముదాయమును, పోషింప=పెంచుటకు, నీవెకాని=నీవేగాని, వేఱెయొక దాతలేఁడు=ఇంకొక ధర్మాత్ముఁడులేఁడు, వెదకిచూడఁగ=పరికించిచూడగా!

తా. ఓనరసింహా! ఎవ్వఁడు! అడవి పక్షులకు, మృగములకు, వనచరములకు ఆహారమిచ్చెను? ఎవ్వఁడు చెట్లకు నీళ్లుతోడి పోసెను? స్త్రీలగర్భముల యందలి బిడ్డలపెంచెను? పాములకు పాలుపోసెను? తుమ్మెదలకు తేనె సమకూర్చెను? పశువులకు పచ్చగడ్డినిచ్చెను? ఎంత వెదకినను సమస్తప్రాణులను పోషించే కర్తవునీవేగాని మరియొకదాతలేఁడు.

సీ. దనుజారి నావంటి ♦ దాసజాలము నీకు
కోటిసంఖ్యగలదు ♦ కొదువలేదు
బంట్లసందడివల్ల ♦ బహుపరాకై నన్ను
మఱచిపోకుము భాగ్య ♦ మహిమచేత
దండిగా భృత్యులు ♦ దగిలి నీకుండంగ
బక్కబంటే పాటి ♦ పనికి నగును
నీవు మెచ్చెడిపనుల్ ♦ నేను జేయఁగలేక
యింత వృథాజన్మ ♦ మెత్తినాను
తే. భూజనులలోన నే నప్ర ♦ యోజకుఁడను
గనుక నీసత్కటాక్షంబు ♦ గలుగఁజేయు ॥భూ॥ 45

టీక. భూష...దూర, దనుజారి=రాక్షసులకుశత్రువైనవాఁడా! నావంటి=నాబోటి, దాసజాలము=నౌకరులగుంపు, నీకు, కోటిసంఖ్యకలదు, కొదవలేదు=లోపములేదు, భాగ్యమహిమచేత=ఐశ్వర్యమువలని గొప్పతనముచేతను, బంట్లసందడివల్ల=దాసులతొందరిచేతను, బహుపరాకైనన్=ఎక్కువమఱపుచేత, నన్ను, మఱచిపోకుము, దండిగా=ఎక్కువగా, భృత్యులు=సేవకులు నీకు, తగిలి=వెంటాడి, ఉండగ, బక్కబంటు=చిన్న సేవకుఁడు, ఏపాటిపనికిన్=ఏమాత్రముపనికి, అగును=సహాయమగును, నీవు, మెచ్చెడి

పనుల్=పొగడెడిపనులను, నేనుఁజేయఁగలేక, ఇంత=ఇటువంటి, వృధాజన్మము=పనికిరానిపుట్టుక, ఎత్తినాఁడ=పుట్టితిని, భూజనులలోన=భూమియందలిప్రజలలో, నేను, అప్రయోజకుఁడను=పనికిమాలినవాఁడను, కనుక, నీసత్కటాక్షంబు=నీదయతోఁగూడినచూపు, కలుగఁజేయుము=కలిగింపుము.

తా. ఓనరసింహస్వామీ! నావంటిసేవకులు నీకనేకకోట్లుగలరు. ఆసేవకులసందడిలోను, భాగ్యంబువలనను, మఱపుచేతను నన్ను మరువవలదు. నీసేవకులు బలవంతులయి నిన్ను వెంటాడుదురు. నేను బలములేనివాఁడను, నీవు మెచ్చుకొనేపనులనుచేయలేను. ప్రయోజనములేనిపుట్టుకపుట్టి జనులలో నీచుఁడనైతిని. నన్ను నీవేకాపాడవలయును.

సీ. కమలలోచన నన్ను ♦ గన్నతండ్రివి గాన
నిన్ను నేమఱకుంటి ♦ నేనువిడక
నుదర పోషణకునై ♦ యొకరి నే నాశింప
నేర నా కన్నంబు ♦ నీవు నడుపు
పెట్టలే నంటివా ♦ పిన్న పెద్దలలోనఁ
దగవు కీప్పూడు దీయఁ ♦ దలఁచినాను
ధనము భారంబైనఁ ♦ దలకిరీటము నమ్ము
కుండలంబులు పైఁడి ♦ గొలుసు లమ్ము
తే. కొనకు నీశంఖచక్రముల్ ♦ కుదువఁ బెట్టి
గ్రాసము నొసంగి పోషించు ♦ కపట ముడిగి ॥భూ॥ 46

టీక. భూష...నార, కమలలోచన=పద్మములవంటి కన్నులుగలవాఁడా! నన్నుఁ గన్నతండ్రివి గాన=పుట్టించినతండ్రివగుట, నిన్నుఁ, నేమఱకుంటి=మఱువకుంటిని, నేను, విడక, ఉదరపోషణకునై=పొట్టనింపుకొనుటకుగాను, ఒకరిఁ=నీకంటెమఱియొకరిని, ఏఁ=నేను, ఆశింపనేరఁ=అడుగజాలను, నాకు, అన్నంబు, నీవునడుపు=నీవేపెట్టుము, పెట్టలేనంటి

వా=పెట్టజాలనన్నచో, పిన్నపెద్దలలోనఁ=పెద్దచిన్నలలోను, ఇప్పుడు, తగవుకు=న్యాయము నేర్పరుచుటకు, తీయఁతలఁచినాను = రప్పింపనెంచితిని, ధనము భారంబైన=డబ్బునిచ్చుటకష్టమనితోఁచినచో, తలకిరీటముఁ=తలపై ధరించుకిరీటమును, అమ్ము=అమ్మివేయుము, కుండలంబులు=చెవులకుధరించు పోగులు, పైఁడిగొలుసులు=బంగారపుగొలుసులు, అమ్ము, కొనకు=చివరకు నీశంఖచక్రముల్, కుదువఁబెట్టి=తాకట్టుపెట్టి, కపటము=మోసము, ఉడిగి=మాని, గ్రాసమును=ఆహారమును, ఒసంగి=యిచ్చి, పోషించు=పెంచుము.

తా. ఓనరసింహా! నన్ను పుట్టించినవాడవు నీవే గాన నిన్ను మఱువక విడువకుంటిని. పొట్టనింపుకొనుటకు మరియొకరిని వేడజాలను. సాకాహారము నీవే పెట్టుము. పెట్టలేనందువేని పిన్నపెద్దలవద్దకు తగవునకు రప్పింపదలఁచితిని. ధనమునిచ్చుటకష్టమనిదోచినచో నీకిరీటమును, కుండలములను, బంగారపుగొలుసులను అమ్మివేయుము. అప్పటికి ధనముచాలకున్నచో చివరకు నీ శంఖచక్రముల తాకట్టుపెట్టి ద్రోహచింతమాని యాహారమిచ్చి నన్ను పెంచుము.

సీ. కువలయశ్యామ నీ ♦ కొలువు చేసిననాకు
జీత మెందుకు ముట్ట ♦ జెప్పవైతి
మంచిమాటలచేతఁ ♦ గొంచె మియ్యఁగలేవు
కలహ మానికఁ జుమ్మి ♦ ఖండితముగ
నీవు సాధువు గాన ♦ నింతపర్యంతంబు
చనువుచే నిన్నాళ్ళు ♦ జరుపవలసె
నిఁక నే సహింప నీ ♦ విపుడు నన్నేమైన
శిక్ష చేసినఁ జేయుఁ ♦ సిద్ధమయితి
తే. నేఁడు కరుణింపకుంటివా ♦ నిశ్చయముగ
దెగఁబడితి జూడు నీతోడ ♦ జగడమునకు ॥భూ॥ 47

టీక. భుజ... దూఁగ, కువలయ=నల్లకలువవలె, శ్యామ=చామనచాయగలవాఁడా! నీకొలువుచేసిననాకు=నీసేవచేసిననాకు, జీతము=బత్తెము, ఎందుకు, ముట్టఁజెప్పవైతి=ఇయ్యకుంటివి, మంచిమాటలచేతన్, కొంచెము=ఏమాత్రమును, ఇయ్యఁగలేవు=ఈయజాలవు, ఇఁకన్=ఇకముందు, ఖండితముగన్=తప్పకుండ, కలహము=జగడము, ఔఁజుమ్మి=అగునుసుమా! ఈవు=నీవు, సాధువుగానన్=మంచివాఁడవుగనుక, ఇంతపర్యంతంబు, చనువుచేన్=పరిచయముచేత, ఇన్నాళ్లు=ఇన్నిరోజులు, జరుపవలసెన్=గడపవలసివచ్చినది, ఇఁకన్=ఇఁకముందు, ఏసహింపను=నేనోర్వను, ఈవు, ఇపుడు, నన్ను, ఏమి, ఐన, శిక్షచేసినన్=దండనజేసినను, చేయుము=చేయుము, సిద్ధమైతిన్=తయారైతిని, నేఁడు=ఈవేళ, కరుణింపకుంటివా=దయచూపకున్న, నిశ్చయముగ=నిజముగ, నీతోడ, జగడమునకు, తెగబడితిని=సాహసించితిని, చూడు=చూచుకొనుము.

తా. ఓనరసింహా! నీసేవజేసిననాకు కూలెందువలనముట్టచెప్పలేదు. మంచిమాటచేత నేమాత్రమునీయజాలవు ఇకముందు తప్పకుండగ జగడమగును. నీవుశాంతుడవు కాబట్టి యింతవఱకు పరిచయముచేత గడపవలసివచ్చినది. ఇఁకముందు నేసహింపను. నీవిపుడు నన్నేమైన శిక్షచేయతలచినచో సిద్ధముగానుంటిని. ఈవేళనన్ను కరుణింపకుంటివేని, నిజముగా నీతోడ జగడమునకు తయారుగానుంటిని.

సీ. హరినీకు బర్యంక • మైన శేషుఁడు చాల
బవనము భక్షించి • బ్రతుకుచుండు
ననువుగా నీకు వా • హనమైన ఖగరాజు
గొప్పపాముల నోటఁ • గొఱుకుచుండు
నదిగాక నీ భార్య • యైన లక్ష్మీదేవి
దినము పేరంటంబు • దిరుగుచుండు

నిన్ను భక్తులు పిల్చి ♦ నిత్యపూజలుచేసి
ప్రేమఁ బక్వాన్నముల్ ♦ పెట్టుచుండ్రు
తే. స్వస్థముగ నీకు గ్రాసము ♦ జరుగుచుండఁ
గాసు నీచేతిదొకటైనఁ ♦ గాదు వ్యయము ॥భూ॥ 48

టీక. భూష...దూర, హరి=ఓనరసింహమూర్తి! నీకున్=పర్యంకమయిన=పడకయైన, శేషుఁడు=ఆదిశేషుఁడు. చాలన్=మిక్కిలి, పవనము=గాలిని, భక్షించి=తిని, బ్రతుకుచుండున్, అనుపుగా=ఒప్పుగా, నీకు, వాహనమైన=ఎక్కుడియైన, ఖగరాజు=గరుత్మంతుడు, గొప్పపాములు, నోటన్=నోటిచే, కొఱుకుచుండున్=తినుచుండును, అదిగాక, నీభార్యయైన, లక్ష్మీదేవి, దినము=ప్రతిదినము, పేరంటంబు=పేరంటమునకు, తిరుగుచుండున్=సంచరించుచుండును, నిన్ను, భక్తులు, పిల్చి, నిత్యపూజలుచేసి=ప్రతిదినము పూజలుసలిపి, ప్రేమన్=భక్తితో, పక్వాన్నముల్=పరమాన్నములను, పెట్టుచుండన్=పెట్టుచుండగా, స్వస్థముగ=నెమ్మదిగా, గ్రాసము=భోజనము' జరుగుచుండన్=జరుగుచుండగా, కాసు=దమ్మిడీలో అయిదవవంతు, ఒకటైనన్, నీచేతిది=నీస్వంతము, వ్యయముకాదు=ఖర్చుకాదు;

తా. ఓనరసింహా! నీవుపరుండు ఆదిశేషుఁడు గాలిని తిని బ్రతుకుచుండును. నీవాహనమైన గరుత్మంతుఁడు గొప్పపాములను తినుచుండును. నీభార్యయగు లక్ష్మీదేవి నిత్యమును పేరంటమునకేగును. నిన్ను నీభక్తులు పిల్చి సదాపూజలుచేసి ప్రేమతో పరమాన్నము ను పెట్టుచుండును. నిశ్చింతగా నీకు అన్నవస్త్రములున్నవి. నీచేతిదొక కాసయినను ఖర్చుకాదు.

సీ. పుండరీకాక్ష నా ♦ రెండు కన్నులనింత
నిన్నుఁ జూచెడి భాగ్య ♦ మిన్నఁడయ్య
వాసిగా నామనో ♦ వాంఛ దీరెడునట్లు
సొగసుగా నీరూపు ♦ జూపవయ్య

పాపకర్మునికంటెఁ ♦ బడకపోవుదమంచు
బరుషమైన ప్రతిజ్ఞఁ ♦ బట్టినావ
వసుధలోఁ బతితపా ♦ వనుఁడ వీవంచునే
బుణ్యవంతులనోటఁ ♦ బొగడవింటి
తే. నేమిటికి విస్తరించె నీ ♦ కింతకీర్తి
ద్రోహినైనను నాకీవు ♦ దొరకరాదె ॥భూ॥ 49

టి. భూష...దూర, పుండరీకాక్ష = తెల్లతామరపద్మమువంటి కన్నులుగలవాఁడా! నారెండుకన్నులనిండ = నాకన్నులార, నిన్నున్, చూచెడిభాగ్యము = అదృష్టము, ఎన్నఁడయ్య = ఎప్పుడోగదా! వాసిగా = ఖ్యాతిగా, నామనోవాంఛ = నామనసునందలికోర్కె, తీరెడునట్లు = నెరవేరునట్లు, నీరూపున్ = నీఆకారమును, సొగసుగా = చక్కగా, చూపవయ్య = కనుబఱుపుము! పాపకర్మునికంటెన్ = దుర్మార్గునిచూపునందు, పడకపోవుదమంచున్ = కనబడకూడదనుకొని పరుషమైన ప్రతిజ్ఞన్ = కఠినపుపంతమును, పట్టినావ = చేసితివా! వసుధలోన్ = భూమియందు, ఈవు = నీవు, పతితపావనుఁడవు = పాపులను పవిత్రులనుజేయువాఁడవు, అంచున్ = అనుచు, ఏన్ = నేను, పుణ్యవంతులు = పుణ్యాత్ములు, నోటన్ = నోటితో, పొగడవింటిన్ = కొనియాడగా నాలించితిని, ఇంతకీర్తి = ఇంతగొప్పతనము, నీకు, ఏమిటికి = ఎందుకొఱకు, విస్తరించెన్ = వ్యాపించినది, ద్రోహినైనను = పాపకర్ముఁడనైనను, నాకు, ఈవు = నీవు, దొరకరాదె = దొరకకూడదా!

తా. ఓనరసింహా! నాకన్నులకఱవుదీర నిన్నుజూచు అదృష్ట మెప్పుడో కలుగును? నాకోర్కెదీఱునట్లు నీచక్కనిరూపము నొక్కమాఱుఁజూపుము. దుర్మార్గునికంటికి కనబడకూడదని కఠినమగు పంతమును పట్టితివా! పాపాత్ములను పాపములులేనివానినిగాజేయువాఁడవని పుణ్యాత్ములు నిన్నుఁ గొనియాడగా వింటిని. నీకీర్తి విస్తారముగ నేల వ్యాపింపవలయును? ద్రోహుఁడనయ్యును నాకు నీవు దొరకరాదా!

సీ. పచ్చి చర్మపుఁదిత్తి • పసలేదు దేహంబు
లోపల నంతట • రోయరోఁత
నరములు శల్యముల్ • నవరంధ్రములు రక్త
మాంసంబు కండలు • మైలతిత్తి
బలుపైన యెండ వా • నల కోర్వదెంతైన
దాళలే దాఁకలి • దాహములకు
సకల రోగములకు • సంస్థానమయి యుండు
నిలువ దస్థిరమైన • నీటిబుగ్గ
తే. బొందిలోనుండు ప్రాణముల్ • పోయినంతఁ
గాటికేగాని కొఱగాదు • గవ్వకైన ॥భూ॥ 50

టీ. భూష...దూర, దేహంబు=శరీరము, పచ్చిచర్మపుఁదిత్తి=పచ్చి తోలుతో తయారుచేసినసంచివంటిది, పసలేదు=సారములేదు, లోపలనంతట=లోనంతటను, రోయ=వెదకిచూడ, రోఁత=అసహ్యము, నరములు=నాడులు, శల్యముల్=ఎముకలు, నవరంధ్రములు=తొమ్మిదిచిల్లులు, రక్త=రక్తము, మాంస=మాంసము, కండలు, మైలతిత్తి=అపరిశుద్ధమైన సంచివంటిది, బలుపైన=తీక్ష్ణమగు, ఎండవానలకు, ఎంతైన=ఏమాత్రమును, ఓర్వదు=తాళఁజాలదు, ఆఁకలిదాహములకు, తాళలేదు=ఓర్వలేదు, సకల=సమస్తములయిన, రోగములకు=జబ్బులకు, సంస్థానమయి=నివసించుచోటైఉండును, నిలువదు=ఆగదు, అస్థిరమైన=శాశ్వతముగానిదగు, నీటిబుగ్గ=నీటిబుడగవంటిది, బొందిలోనుండు=శరీరమందుండు, ప్రాణముల్ పోయినంత=జీవనములు పోయినంతనే, కాటికేగాని=వల్లకాటికేగాని, గవ్వకైన=గవ్వమాత్రముకైనను, కొఱగాదు=పనికిరాదు.

తా. ఓనరసింహస్వామీ! ఈశరీరము పచ్చితోలుతో చేయబడిన సంచి. లోపలనంతయు నసహ్యము. ప్రేగులు యెముకలు రక్తమాంసములు

వవసాడులు నెందుకు పనికిరానిమైలతిత్తులు. ఎండవానలకు తాళలేవు. రోగములన్నియునుండును. నీటిబుడగవలెనే స్థిరమైనదికాదు. ప్రాణములు బొందిలోనుండిపోగానే గవ్వకైన పకిని రాదు. వెంటనే వల్లకాటికిచేర్తురు.

సీ. బలురోగములకు నీ ♦ పాద తీర్థమె గాని
వలపు మందులు నాకు ♦ వలదు వలదు
చెలిమిసేయుచు నీకు ♦ సేవజేసెదఁ గాని
నీ దాసకోటిలో ♦ నిలుపవయ్యా
గ్రహభయంబునకుఁ జ ♦ క్రముఁదలంచెదఁ గాని
ఘోరరక్షలు కట్టఁ ♦ గోరనయ్యా
పాముకాటుకు నిన్ను ♦ భజనఁ జేసెదఁగాని
దానిమంత్రము నేను ♦ తలఁపనయ్యా
తే. దొరికితివి నాకు దండివై ♦ ద్యుఁడవు నీవు
వేయికష్టాలు వచ్చిన ♦ వెఱవనయ్యా ॥భూ॥ 51

టీ. భూష...దూర, బలురోగములకు=పెద్దపెద్ద జబ్బులకు, నీపాద తీర్థమెకాని=నీపాదములుకడిగిననీరేకాని, వలపుమందులు=వైద్యునిమందులు, నాకు, వలదువలదు=అక్కరలేదు, చెలిమిసేయుచు=స్నేహముగలుపుచు, నీ సేవజేసెదగాని=నీపూజచేయుదునేగాని, నీదాసకోటిలో=నీభక్తులందరిలో, నిలుపవయ్యా=చేర్చుము, గ్రహభయంబునకున్=గ్రహమువలన కలుఁగుబాధకు చక్రముతలంచెదకాని = నీచక్రము నేతలచెదకాని, ఘోరరక్షలు=భయంకరమైనరక్షరేకులు, కట్టగోరనయ్యా=కట్టుకొనకోరను, పాముకాటుకు=పాము కరచినచో, నిన్ను, భజనచేసెదకాని=కొలిచెదనేకాని, దానిమంత్రమున్= పాముమంత్రమును, ఏను=నేను, తలఁపనయ్యా=తలఁచను, దండివైద్యుఁడవు= గొప్పవైద్యుఁడవు, నీవు, నాకు, దొరికితివి, వేయికష్టాలువచ్చిన=అనేకబాధలుకలిగినను, వెఱవనయ్యా=భయపడనుసుమా !

తా. ఓనరసింహా! పెద్దపెద్దజబ్బులకు నీపాదతీర్థమేకాని వలపుమందులు నాకక్కఱలేదు. జతగోరి నీసేవఁజేసెదఁగాన నీభక్తకోటిలోఁజేర్పుము. గ్రహములవలనగల్గుబాధలకు నీచక్రమునే స్మరింతునుకాని, రక్షరేకులను గోరను. పాముకాటునకు నీనామస్మరణజేసెదఁగాని పాముమంత్రమును కోరను. నీవే నాకు గొప్పవైద్యుఁడవు. కాబట్టి ఎన్నికష్టములు కలిగినను భయపడను.

సీ. కూటికోసరము నేఁ ♦ గొఱగాని జనులచే
బలు గద్దరింపులు ♦ పడఁగ వలసె
దారసుత భ్రమ ♦ దగిలియుండఁగఁగదా
దేశ దేశములెల్లఁ ♦ దిరుగవలసెఁ
బెనుదరిద్రతపైని ♦ బెనఁగి యుండఁగఁగదా
చేరి నీచుల సేవ ♦ చేయవలసె
నభిమానములు మది ♦ నంటియుండఁగఁ గదా
పరులఁ జూచిన భీతి ♦ పడఁగ వలసె
తే. నిటులసంసార వారధి ♦ నీఁద లేక
వేయి విధముల నిన్ను నే ♦ వేఁడుకొంటి ॥భూ॥ 52

టీ. భూష...దూర, నేఁ=నేను, కూటికోసరము=అన్నముకొఱకై కొఱగానిజనులచే=పనికిమాలినమనుష్యులచేత, బలుగద్దరింపులు=అనేకమందలింపులు, పడఁగవలసె=పడవలసివచ్చినది, దార=భార్యయందును, సుత=కొడుకులయెడలను, భ్రమ=మోహము, తగిలియుండఁగగదా=తగుల్కొనియుండుటవల్ల నేగదా! దేశదేశములెల్లఁ=ఆయాదేశములెల్లను, తిరుగవలసెఁ, పెనుదరిద్రత=మిక్కిలిబీదతనము, పైని=నాపైని, పెనఁగియుండఁగఁగదా=చుట్టుకొనియున్నందుచేత నేకదా! చేరి దగ్గరకువెళ్ళి, నీచులసేవ=హీనులకొలువు, చేయవలసె, అభిమానములు=గౌరవములు, మదిఁ=మనసునందు, అంటియుండఁగఁగదా=కలిగియుండుటవల్ల నేఁగదా, పరులఁ=ఇతరు

లను, చూచిన, భీతిపడఁగవలసెన్=భయపడవలసివచ్చెను, ఇటుల=ఈవిధముగా, సంసారవారధిన్=సంసారమను సముద్రమును, ఈఁదలేక=దాఁటలేక, వేయివిధముల=అనేకవిధముల, నిన్ను, నే=నేను, వేఁడుకొంటి=ప్రార్థించితిని.

తా. ఓనరసింహా! కూటికొఱకై హీనులచేత ననేక మందలింపులును, భార్యాపుత్రులమీద మోహముచేత దేశదేశములు తిరుగుటయును, మిక్కిలి బీదతనముచుట్టియుండుటచేత నీచులదరిజేరి సేవజేయుటయు, అభిమానము మనములోనుండుటచేత యితరులజూచి భయపడుటయు, నాకు సంభవించినవి. ఈవిధముగా సంసారమను సముద్రమునుదాఁటలేక నీస్మరణచే దాటవచ్చునని అనేకవిధముల నిన్నుఁ బ్రార్థించుచున్నాను.

సీ. సాధు సజ్జనులతో ♦ జగడమాడినఁ గీడు
కవులతో వైరంబు ♦ గాంచఁగీడు
పరమ దీనులఁ జిక్కఁ ♦ బట్టికొట్టినఁ గీడు
భిక్షుకులను దుఃఖ ♦ పెట్టగీడు
నీటుపేదలనుజూచి ♦ నిందఁజేసినఁ గీడు
పుణ్యవంతులఁ దిట్టఁ ♦ బొసగుఁ గీడు
సద్భక్తులను దిర ♦ స్కార మాడినఁ గీడు
గురుని ద్రవ్యము దోఁచు ♦ కొనినఁ గీడు
తే. దుష్టకార్యము లొనరించు దుర్జనులకు
ఘనతరంబైన నరకంబు ♦ గట్టిముల్లె ॥భూ॥ 53

టీ. భూషణ...దూర, సాధుసజ్జనులతో=సెమ్మదిగలవారితోడను,యోగ్యులతోడను, జగడమాడినన్=పోట్లాడిన, కీడు=అపకారము, కవులతో=కవిత్వముచెప్పువారితో, వైరంబు=విరోధము, కాంచఁగీడు=పెట్టుకొనిన చెఱుపు, పరమదీనులన్ = మిక్కిలిభయపడువారిని, చిక్కఁబట్టి=బంధించి,

కొట్టినన్=కొట్టినచో, కీడు, భిక్షుకులను, బిచ్చగాండ్రను, దుఃఖపెట్టన్=ఏడ్పించిన, కీడు, నిఱుపేదలనుజూచి=మిక్కిలిబీదలకనుగొని,నిందచేసినన్=నిందించినచో, కీడు, పుణ్యవంతులకున్=పుణ్యాత్ములను, తిట్టన్=తిట్టిన, కీడు, పొసగున్=కలుగును, సద్భక్తులను=గొప్పభక్తులను, తిరస్కారమాడినన్=అనాదరముచేసినచో, కీడు, గురునిద్రవ్యమున్=గురువుయొక్కధనము దోఁచుకొనినన్=అపహరించినచో, కీడు, దుష్టకార్యములు=చెడుపనులు, ఒనరించు=చేయునట్టి, దుర్జనులకు, ఘనతరంబైన=ఘోరమయిన, నరకంబు=నరకమే, గట్టిముల్లె=కూడబెట్టుకొనినధనమువంటిది.

తా. ఓనరసింహా ! సాధువులతో సజ్జనులతో పోట్లాడుట, కవులతో విరోధపడుట, మిక్కిలిభయపడుదీనులనుబంధించికొట్టుట, బిచ్చగాండ్రనేడ్పించుట, నిఱుపేదలను నిందించుట, పుణ్యాత్ములనుతిట్టుట, గొప్పభక్తులను తిరస్కరించుట, గురునిధనము నపహరించుట మొదలగునవి చెఱుపును గలిగించును. దుష్టకార్యములుచేయు దుర్మార్గులకు నరకమే కూడబెట్టుకొనిన ధనమువంటిది.

సీ. పరుల ద్రవ్యము మీఁద ♦ భ్రాంతి నొందిన వాఁడు
పరకాంతల నపేక్ష ♦ పడెడు వాఁడు
అర్థులవిత్తంబు ♦ లపహరించెడు వాఁడు
దానమియ్యంగ వ ♦ ద్దనెడు వాఁడు
సభలలోపల నిల్చి ♦ చాడి చెప్పెడి వాఁడు
పక్షపు సాక్ష్యంబు ♦ పలుకు వాఁడు
విష్ణు దాసులఁ జూచి ♦ వెక్కిరించెడి వాఁడు
ధర్మసాధులఁ దిట్టఁ ♦ దలఁచు వాఁడు
తే. ప్రజల జంతుల హింసించు ♦ పాతకుండు
కాలకింకర గదలచేఁ ♦ గష్టమొందు ॥భూ॥ 54

టీ. భూష...దూర, పరుల(ద్రవ్యముమీఁద = ఇతరులధనముమీఁద, భ్రాంతినొందినవాఁడు=ఆసపడినవాఁడు, పరకాంతలక్ = ఇతరస్త్రీలను, అపేక్షపడెడువాఁడు=ఆశించువాఁడును, అర్థుల=యాచకుల, విత్తంబు=సొమ్మును, అపహరించెడివాఁడు=దొంగిలించువాఁడును, దానము=ధర్మము, ఇయ్యంగ=చేయుచుండగ, వద్దు, అనెడువాఁడు, సభలలోపల=సభలందు, నిల్చి, చాడిచెప్పెడివాఁడు=ఇతరులపై నేరములుచెప్పువాఁడును, పక్షపుసాక్ష్యంబుపలుకువాఁడు=అబద్ధపుసాక్ష్యమిచ్చువాఁడును, విష్ణుదాసులక్=విష్ణుభక్తులనుచూచి, వెక్కిరించెడువాఁడు=నవ్వువాఁడును, ధర్మసాధులక్=ధర్మబుద్ధిగలసాధువులను, తిట్టక్=నిందించుటకు, తలఁచువాఁడు=ఆలోచించువాఁడును, ప్రజల=మనుష్యులను, జంతులక్=జంతువులను, హింసించు=బాధించు, పాతకుండు=పాపాత్ముఁడును, కాల=యముని, కింకర=భటులయొక్క, గదలచేక్=గుదియలచేత, కష్టము=బాధను, ఒందు=పొందును.

తా. నరసింహస్వామీ! ఇతరులధనమునకు నితరులస్త్రీలకొఱకు నాసపడువాడును, బిచ్చగాండ్రడబ్బుదొంగిలించువాడును, దానముచేయవద్దని చెప్పువాడును, సభలలో నితరులపై నేరముల బలుకువాడును అబద్ధపుసాక్ష్యములనిచ్చువాడును, విష్ణుభక్తులను వెక్కిరించువాఁడును, సాధువులను తిట్టువాడును మనుష్యులను జంతువులను బాధించువాడును యమభటులవలన బాధల నొందుదురు.

సీ. నరసింహ నాతండ్రి ♦ నన్నేలు నన్నేలు
కామితార్థము లిచ్చి ♦ కావు కావు
దైత్యసంహార చాల ♦ దయయుంచు దయయుంచు
దీనపోషక నీవె ♦ దిక్కు దిక్కు
రత్నభూషితవక్ష ♦ రక్షించు రక్షించు
భువన రక్షక నన్నుఁ ♦ బ్రోవు ప్రోవు

మారకోటి స్వరూప ♦ మన్నించు మన్నించు
పద్మలోచన చేయి ♦ పట్టుఁ బట్టు
తే. సురవినుత నేను నీచాటుఁ ♦ జొచ్చినాను
నామొఱాలించి కడతేర్చు ♦ నాగశయన ॥భూ॥ 55

టీ. భూప...దూర, నరసింహ=ఓనరసింహమూర్తి! నాతండ్రి=నా కురక్షకుఁడా! నన్నేలు=నన్నుకాపాడుము, కామితార్థములు=కోరినకోరికలు, ఇచ్చి, కావుకావు=రక్షింపురక్షింపుము, దైత్య=రాక్షసులను, సంహార=సంహరించినవాఁడా! చాలదయయుంచు=ఎక్కువప్రేమయుంచుము, దీనపోషక=దిక్కులేనివారిని రక్షించువాఁడా। నీవెదిక్కు-దిక్కు=నీవేఆధారము, రత్నభూషితవక్ష=కౌస్తుభరత్నముచే నలంకరింపబడిన వక్షస్థలముఁగలవాఁడా! రక్షించురక్షించు, భువనరక్షక = లోకములనురక్షించువాఁడా! నన్ను, ప్రోవుప్రోవు=పోషింపుము, మారకోటి =కోటిమన్మధులయొక్క, స్వరూపముగలవాఁడా! మన్నించుమన్నించు=క్షమింపుము, పద్మలోచన=పద్మములవంటికన్నులుగలవాఁడా! చేయిపట్టుపట్టు= అభయహస్తమిమ్ము, సురవినుత=దేవతలచేపొగడబడువాఁడా! నేను, నీచాటుచొచ్చినాను=నీశరణుజేరితిని, నాగశయన = పామునుమీఁదపవళించువాఁడా! నామొఱ=నాప్రార్థనలను, ఆలకించి=విని, కడతేర్చు=ఉద్ధరింపుము.

తా. ఓనరసింహా! నాతండ్రీ! నన్నుకాపాడుము. కోరినకోర్కెల నిచ్చి రక్షింపుము. దైత్యసంహారా! దయయుంచుము. దీనపోషకా! నీవే నాకుదిక్కు. రత్నభూషితవక్షా! రక్షింపుము. లోకపాలకా! నన్ను పోషింపుము. మారకోటిస్వరూపా! క్షమింపుము. పద్మలోచనా! అభయహస్త మిమ్ము. సురవినుతా! నేను నీశరణుజేరితిని, శేషశయనా! నామొఱాలించి నన్నుద్ధరింపుము.

సీ. నీ భక్తులను గనుల్ ♦ నిండజూచియు రెండు
చేతుల జోహారు ♦ సేయువాఁడు

నేర్పుతో నెవ్వరైన ♦ నీకథల్ చెప్పంగ
 వినయమందుచుఁ జాల ♦ వినెడువాఁడు
తన గృహంబునకు నీ ♦ దాసులు రాఁజూచి
 పీటపైఁ గూర్చుండఁ ♦ బెట్టువాఁడు
నీసేవకులజాతి ♦ నీతు లెన్నక చాల
 దాసోహ మని చేరఁ ♦ దలఁచువాఁడు
తే. పరమభక్తుండు ధన్యుండు ♦ భానుతేజ
 వానిఁగనుఁగొన్నఁ బుణ్యంబు ♦ వసుధలోన ॥భూ॥ 56

టీ. భూష...దూర, భానుతేజ =సూర్యునివంటికాంతిగలవాఁడా! నీభక్తులను= నీదాసులను, కనుల్ నిండజూచియు = కన్నులార గాంచియు, రెండు చేతులన్ =రెండుచేతులతో, జోహారు సేయువాఁడు = నమస్కరించువాఁడును, నీకథల్ =నీచరిత్రములు, ఎవరైనన్ =ఎవరైన, నేర్పుతో, చెప్పంగ, వినయమందుచున్ =వినయముగల్గినవాఁడై, చాలవినెడువాఁడు= శ్రద్ధగా వినెడువాఁడును,తనగృహంబునకు=తనయింటికి,నీదాసులు=నీభక్తులు,రాన్= రాగా, చూచి, పీటపైన్, కూర్చుండన్, పెట్టువాఁడు, నీసేవకుల, జాతినీతులెన్నక=కులమునుస్వభావమును దలపోయక, చాలదాసోహమని= మిగులదాసుఁడనని, చేరఁదలఁచువాఁడు=దరిజేరువాఁడును, పరమభక్తుండు= మిక్కిలిభక్తిగల్గినవాఁడు, ధన్యుండు=పుణ్యవంతుఁడు, వసుధలోనన్ =భూమియందు, వానిన్, కనుఁగొన్న=చూచిన, పుణ్యంబు=పుణ్యముకలుగును.

తా. ఓనరసింహా! నీభక్తులను రెండుకన్నులతోజూచి రెండుచేతులతో నమస్కరించువాఁడును, నీకథలనెవ్వరైన చక్కగా చెప్పుచున్న వినయముతో వినువాఁడును, తనయింటికి నీభక్తులువచ్చినచో వారిని పీటపైకూర్చుండఁబెట్టువాఁడును, నీభక్తులకులమును నడతను తలపెట్టక దాసుడనని దగ్గరకుచేరువాఁడును, మిక్కిలిభక్తిగలవాడును, ధన్యాత్ముడగును. అట్టివానిని చూచినచో పుణ్యంబుగలుగును.

సీ. పంజరంబునఁ గాకి ♦ పక్షినుంచిన లెస్స
పలుకునే వింతైన ♦ చిలుకవలెను
గార్ధభంబును దెచ్చి ♦ కళ్ళెమింపుగ వేయఁ
దిరుగునే గుఱ్ఱంబు ♦ తీరుగాను
ఎనుపపోతును మావ ♦ టీఁడు శిక్షించిన
నడఁచునే మదవార ♦ ణంబువలెను
పెద్దపిట్టను మేఁత ♦ బెట్టిపెంచినఁ గ్రొవ్వి
సాగునే వేఁటాడు ♦ డేగవలెను
తే. గుజనులను దెచ్చి నీసేవ ♦ కొఱకు బెట్ట
వాంఛతోఁ జేతురే భక్త ♦ వరులవలెను ॥భూ॥ 57

టీ. భూష...దూర, పంజరంబునఁ=పంజరమందు, కాకిపక్షినుంచినఁ=కాకినుంచినయెడల, వింతైనచిలుకవలెను=చోద్యముగమాటాడు రామచిలుకవలె, లెస్సపలుకునే=ఇంపుగామాట్లాడునా? గార్ధభంబును=గాడిదను, తెచ్చి, ఇంపుగ=చక్కఁగా, కళ్ళెమువేయుఁ=కళ్ళెముతగిలించినచో, గుఱ్ఱంబుతీరుగాను=గుఱ్ఱమువలె, తిరుగునా=నడచునా? ఎనుపపోతును=దున్నపోతును, మావటీఁడు=ఏనుగను నడుపువాఁడు, శిక్షించినఁ=క్రమముగ శిక్షచేసినచో మదవారణంబువలెను=మదించినఏనుగరీతిగా, నడచునే=నడుచునా? పెద్దపిట్టను=రాబందును, మేఁతఁ పెట్టి, పెంచినఁ, క్రొవ్వి=బలిసి, వేటాడు డేగవలెను, సాగునే=పోవునా? నీసేవకొఱకుఁ=నిన్నుపూజించు నిమిత్తము, కుజనులను=దుర్మార్గులను, తెచ్చి=తీసుకవచ్చి, పెట్టఁ=నియమించినచో, వాంఛతో=కోరికతో, నీభక్తవరులవలెను=నీభక్తశ్రేష్ఠులవిధముగా చేతురే=పూజచేయుదురా?

తా. ఓనరసింహస్వామీ! కాకిని పంజరమందుంచి పెంచినంతనే చిలుకవలె పలుకలేదు. గాడిదకు కళ్ళెమువేసినంతమాత్రమున గుఱ్ఱమువలె

స్వారిచేయుటకు పనికిరాదు. దున్నపోతునకు మావటివాడు శిక్ష నేర్పినను ఏనుగవలె నుపయోగపడదు. రాబందు నెంతమేపినను డేగవలె వేటకు పనికి రాదు. అట్లే దుర్మార్గులను నీసేవచేయ నాజ్ఞాపించినను నీభక్తులవలెచేయరు.

సీ. నిగమాది శాస్త్రముల్ ♦ నేర్చిన ద్విజుఁడైన
యజ్ఞకర్తకు సోమ ♦ యాజియైన
ధరణిలోపలఁ బ్రభా ♦ తస్నానపరుఁడైన
నిత్యసత్కర్మాది ♦ నిరతుఁడైన
నుపవాస నియమంబు ♦ నొందు సజ్జనుఁడైన
గావివస్త్రముఁ గట్టు ♦ ఘనుఁడునైన
దండి షోడశమహా ♦ దానపరుండైన
సకల యాత్రలు సల్పు ♦ సరసుఁడైన

తే. గర్వమునఁ గష్టపడి నిన్ను ♦ గానకున్న
మోక్షసామ్రాజ్యమొందఁడు ♦ మోహనాంగ॥భూ॥ 58

టీ. భూష...దూర, మోహనాంగ = అందమగునవయవములుకలవాడా! నిగమాది=వేదములు మొదలైన, శాస్త్రములు, నేర్చిన, ద్విజుఁడైన=బ్రాహ్మణుఁడైనను యజ్ఞకర్తగు=యాగము చేసినవాడైన, సోమయాజియైన, ధరణిలోపలన్=భూమియందు, ప్రభాత=ఉదయకాలమునందు, స్నానపరుఁడైన=స్నానము చేసినవాఁడైనను, నిత్య=ఎల్లప్పుడు, సత్కర్మాది=మంచిపనులచేయుటయందు, నిరతుఁడైన=ఆసక్తిగలవాఁడైనను, ఉపవాసనియమంబున్=నియమపూర్వకమగు ఉపవాసములను, ఒందు=చేయునట్టి, సజ్జనుఁడైన=మంచివాఁడయినను, కావివస్త్రములన్ = కాషాయవస్త్రములను, కట్టు=ధరించు, ఘనుఁడునైన=గొప్పవాఁడయినను, దండి=గొప్పగా, షోడశ=పదనారు, మహాదానపరుండైన=గొప్పదానములు చేయువాడైనను, సకలయాత్రలు=అన్నిపుణ్యస్థలములను తిరుగుటలు, సల్పు=చేయు, సరసుఁడైన=మంచి

వాఁడైనను, గర్వమునన్=గర్వము చేత, కష్టపడి, నిన్నుఁగానకున్న=నిన్ను తెలుసుకొననిచో, మోక్షసామ్రాజ్యము=మోక్షమనెడు రాజ్యపదవి, ఒందఁడు=పొందఁడు.

తా. నరసింహస్వామీ! వేదంబులను శాస్త్రంబులను నేర్చిన బ్రాహ్మణుడుగాని యజ్ఞములు చేసిన సోమయాజికాని యుదయముననే తప్పక స్నానము చేయు పవిత్రుడుగాని ఎప్పుడు మంచిపనులనే చేయువాడుగాని ఉపవాసములను నియమముతో చేయువాడుగాని సన్యాసిగాని పదారువిధంబులగు దానములను చేసినవాడుగాని తీర్థయాత్రలన్ని సేవించినవాడుగాని గర్వముచే నిన్నెఱుగనిచో వానికి మోక్షము దొరకదు.

సీ. పక్షివాహన నేను ♦ బ్రతికినన్ని దినాలు
కొండె గాండ్రను గూడి ♦ కుమతినైతి
నన్నవస్త్రము లిచ్చి ♦ యాదరింపుము నన్నుఁ
గన్నతండ్రివి నీవె ♦ కమలనాభ
మరణ మయ్యెడినాఁడు ♦ మమతతో నీయొద్ది
బంట్లు దోలుము ముందు ♦ బ్రహ్మజనక
యినజభటావళి ♦ యీడిచికొని పోక
కరుణతో నాయొద్దఁ ♦ గావలుంచు
తే. కొనకు నీసన్నిధికిఁ బిల్చు ♦ కొనియు నీకు
సేవకునిఁ జేసికొనవయ్య ♦ శేషశయన ॥భూ॥ 59

టీ. భూష...దూర, పక్షివాహన=గరుడపక్షి నెక్కు-వాఁడా! నేను బ్రతికినన్నిదినాలు, కొండెగాండ్రనుగూడి=కొండెమును చెప్పువారలతో జేరి, కుమతినైతిన్=చెడుబుద్ధిగలవాఁడనైతిని, కమలనాభ=కమలము నాభియందు గలవాఁడా! నీవేకన్నతండ్రివినన్నుఁ ౯, అన్నవస్త్రములు=ఆహారము దుస్తులు, ఇచ్చి, ఆదరింపుము=దయఁజూడుము, బ్రహ్మజనక=బ్రహ్మకుతండ్రివైన

వాఁడా ! మరణమయ్యెడినాఁడు=చచ్చిపోవుదినమున, మమతతో=ప్రేమతో, ముందు=ముందుగనే, నీవొద్దిబంట్లన్=నీకడనున్న సేవకులను, తోలుము=పంపుము, ఇనజ=యమునియొక్క, భటావళి=సేవకులసమూహము, ఈడిచికొనిపోక=ఈడ్చుకొనిపోకుండునట్లుగా, నాయొద్దన్=నాదగ్గర, కరుణతోన్, కావలుంచు=కాపలాయుంచుము, శేషశయన = శేషునిపైపరుండువాఁడా ! కొనకు=తుదకు, నీసన్నిధికిన్=నీదగ్గఱకు, పిల్చుకొనియు=చేరదీసికొని, నీకు, సేవకుసన్=దాసునిఁగా, చేసికొనవయ్యా=చేసికొనుము.

తా. ఓనరసింహా ! పక్షివాహనా ! నేను జీవించియున్నంతకాలము స్నుకొండెగాండ్రతోఁజేరి చెడ్డబుద్ధిగలవాఁడనైతిని. కమలనాభా ! నీవె నన్ను గన్నతండ్రివి; అన్నవస్త్రములిచ్చి నన్నాదరింపుము. బ్రహ్మజనకా ! నేచనిపోవునాఁడు ముందుగ నాకడకుప్రేమతో నీభటులనుపంపి యమకింకరులు నన్నీడ్చుకొనిపోకుండ కాపలాయుంచుము. చివరకు నీదగ్గఱకుబిల్చుకొని నీసేవకునిగా నన్ను జేసుకొనుము.

సీ. నీకు దాసుఁడనంటి ♦ నిన్ను నమ్మికయుంటిఁ
గాన నాపై నేఁడు ♦ కరుణఁజూడు
దోసి లొగ్గితి నీకు ♦ ద్రోహ మెన్నఁగఁబోకు
పద్మలోచన నేను ♦ బరుఁడఁగాను
భక్తినీపై నుంచి ♦ భజనఁ జేసెదఁగాని
పరుల వేఁడనుజుమ్మి ♦ వరము లిమ్ము
దండిదాతవు నీవు ♦ తడవుసేయక కావు
ఘోరపాతకరాశి ♦ గొట్టివైచి
తే. శీఘ్రముగఁ గోర్కెలీడేర్చు ♦ చింత దీర్చు
నిరతముగ నన్నుఁ బోషించు ♦ నెనరు నుంచు ‖భూ‖60

టీ. భూష...దూర, పద్మలోచన=పద్మములవంటి నేత్రములుగలవాఁడా! నీకు, దాసుఁడనంటి=సేవకుఁడనంటిని, నిన్ను, నమ్మికయుంటిఁ, కాన=కాబట్టి, నాపై, నేఁడు=ఇప్పుడు, కరుణఁజూడు=దయఁజూడుము, నీకు, దోసిలొగ్గితి=నమస్కరించితిని, ద్రోహము=కీడు, ఎన్నఁగబోకు=తలఁపవద్దు, నేను, పరుఁడఁగాను=ఇతరుఁడనుగాను, భక్తినీపైనుంచి=నీయందు ధ్యానముంచి, భజనఁజేసెదఁగాని=సేవజేసెదనేగాని, పరుల=ఇతరులను, వేఁడను జుమ్మి=ప్రార్థింపనుసుమా! వరములిమ్ము=కోరికలనిమ్ము, నీవు, దండిదాతవు=గొప్పధర్మకర్తవు, తడవుసేయక=ఆలస్యముచేయక, ఘోరపాతకరాశి=భయంకరమైన పాపజాలమును, కొట్టివైచి=పోఁగొట్టి, కావు=కాపాడుము, శీఘ్రముగఁ=వేగముగ, కోర్కెలు, ఈడేర్చు=నెఱవేర్చుము. చింతఁదీర్చు=దుఃఖమును తొలగించుము, నిరతముగఁ=ఎల్లప్పుడు, నన్ను, పోషించు=పెంచుము, నెనరు=దయను, ఉంచు=ఉంచుము.

తా. ఓనరసింహా! నీకుదాసుఁడను. నిన్నునమ్మియున్నాను, కావున నాయందు దయయుంచుము. నీకు నమస్కరించితిని. కీడుతలఁపకుము. నేను పరుఁడనుగాను, నీయందుభక్తియుంచి భజనసేసెదనేగాని పరులనుప్రార్థింపను. కోరికలదీర్చుము. నీవుగొప్పధర్మప్రభుఁడవు. నాభయంకరపాపములఁ బోఁగొట్టి, వేగమేరక్షింపుము. వెంటనే నాకోర్కెలనుదీర్చి దుఃఖమును మాన్పుము. ఎల్లప్పుడును నన్నుదయయుంచిపోషింపుము.

సీ. విద్య నేర్చితినంచు ♦ విఱ్ఱవీఁగఁగ లేదు
భాగ్యవంతుఁడ నంచుఁ ♦ బలుక లేదు
ద్రవ్యవంతుఁడ నంచుఁ ♦ దఱచు నిక్కఁగ లేదు
నితరదానములైన ♦ నెఱప లేదు
పుత్రవంతుఁడ నంచుఁ ♦ బొగడు చుండఁగ లేదు
భృత్యవంతుఁడ నంచుఁ ♦ బొగడ లేదు

శౌర్యవంతుఁడ నంచుఁ ♦ సంతసింపఁగ లేదు
కార్యవంతుఁడ నంచుఁ ♦ గడవ లేదు
తే. నలుగురికి మెప్పుగానైన ♦ నడవలేదు
నళినదళనేత్ర నిన్ను నే ♦ నమ్మినాను ॥భూ॥ 61

టీ. భూష...దూర, నళినదళనేత్ర= తామరరేకులవంటికన్నులుగల వాఁడా! విద్య నేర్చితినంచు=బాగుగాచదివితినని, విఱ్ఱవీఁగఁగలేదు=గర్వించ లేదు, భాగ్యవంతుఁడనంచు=సంపదగలవాఁడనని, పలుకలేదు, ద్రవ్యవంతుఁడ నంచున్=ధనముగలవాఁడనని, తఱుచు=పలుమారు, నిక్కఁగలేదు=నీలుగ లేదు, నిరతదానములైన=నిత్యదానములైనను, సెఱుపలేదు=చేయలేదు, పుత్ర వంతుఁడనంచున్=పుత్రులుగలిగినవాఁడనని, పొగడుచుండఁగలేదు=పొగడు కొనుటలేదు, భృత్యవంతుఁడనంచున్=సేవకులుగలవాఁడనని, పొగడలేదు= కొనియాడుకొనలేదు, శౌర్యవంతుఁడనంచున్=శూరుఁడనని, సంతసింపఁగ లేదు=సంతోషపడుటలేదు, కార్యవంతుడనంచున్=అనేకకార్యములుచేయ గలవాఁడనని, కడవలేదు=అతిశయపడుటలేదు, నలుగురికి=అందరికి, మెప్పు గానైనన్=మెచ్చుకొనునట్లుగానైన, నడవలేదు=ప్రవర్తింపలేదు, నిన్ను, నేన్=నేను, నమ్మినాను=నమ్ముకొనియుంటిని.

తా. ఓనరసింహా! నేను, బాగుగాచదువుకొంటినని గర్వపడలేదు. భాగ్యవంతుడనని చెప్పలేదు. సంపదగలవాఁడనని నిక్కలేదు. నిత్యదాన ములు చేయలేదు. పుత్రవంతుడనని కొనియాఁడుకోలేదు. సేవకులుగలవాఁడ నని పొగడుకోలేదు. శూరుడనని సంతసింపలేదు. కార్యములన్నియు చేయఁ గలవాఁడనని స్తుతించుకొనలేదు. అందరికి మెప్పుగలుగునట్లు వర్తింపలేదు. నిన్నే నమ్ముకొన్నాను.

సీ. అతిలోభులను భిక్ష ♦ మడుగఁబోవుట రోఁత
తనద్రవ్య మొకరింట ♦ దాఁచ రోఁత
గుణహీనుఁ డగువాని ♦ కొలువుఁ గొల్చుట రోఁత
యొరుల పంచల క్రింద ♦ నుండరోఁత

భాగ్యవంతులతోడఁ ♦ బంతమాడుట రోఁత
గుఱి లేని బంధులఁ ♦ గూడ రోఁత
నాదాయములు లేక ♦ యప్పుదీయుట రోఁత
జారచోరులఁ గూడి ♦ చనుట రోఁత

తే. యాదిలక్ష్మీశ నీబంట ♦ నయితినయ్య
యింక నెడబాయ జన్మంబు ♦ లెంచరోఁత ‖భూ‖ 62

టీ. భూప...దూర, ఆదిలక్ష్మీశ=ఆదిలక్ష్మికిభర్తయైనవాఁడా! అతి లోభులను=మిక్కిలిపిసినిగొట్టులను, భిక్షము=ముష్టిని, అడుగన్=అడుగుట కు, పోవుట, రోఁత=అసహ్యము, తనద్రవ్యము=తనధనము, ఒకరింట=ఇతరులగృహమందు, దాఁచ=దాఁచుట, రోఁత, గుణహీనుఁడగువాని=నీచుఁడైనవాని, కొలువన్=సేవను, కొల్చుట=చేయుట, రోఁత, ఒరులపంచలక్రిందన్=ఇతరులయింటిచూరులయందు, ఉండన్=ఉండుట, రోఁత, భాగ్యవంతునితోడన్=ధనవంతునితో, పంతమాడుట=పట్టుదలపెట్టుకొనుట, రోఁత గుఱిలేని=లక్ష్యములేని, బంధులన్ = చుట్టములను, కూడన్=కలియుట, రోఁత, ఆదాయములేక=రాబడిలేక, అప్పుఁదీయుట = ఋణముచేయుట, రోఁత, జార=వ్యభిచారులను, చోరులన్=దొంగలను, కూడి=కలిసి, చనుట రోఁత, నీబంటునైతినయ్య=నీసేవకుఁడనైతిని, ఇంకన్=ఇఁక,ఎడఁబాయన్=దూరమయిన, జన్మంబులు=పుట్టుటలు, ఎంచన్=ఆలోచింపగా, రోఁత=అసహ్యము.

తా. ఓనరసింహా! మిక్కిలిలోభులను భిక్షమడుగుట, తనద్రవ్యమితరులయింట దాఁచుట, గుణహీనునిసేవించుట, ఒరులపంచనుండుట, భాగ్యవంతులతోడ పట్టుబట్టుట, లక్ష్యములేని చుట్టములతోకలియుట, రాబడిలేకుండ అప్పుదీయుట, జారచోరులతో తిరుగుట, అసహ్యకరములు. నీసేవకుఁడనయితిని ఇఁక నిన్ను నెడబాసి మరలపుట్టుటయు నసహ్యము.

సీ. వెఱ్ఱివానికినేల ♦ వేదాక్షరంబులు
మోటువానికి మంచి ♦ పాటలేల
పశులకాఁపరి కేల ♦ పరతత్త్వ బోధలు
విటకాని కేలకో ♦ విష్ణుకథలు
వదరు శుంఠల కేల ♦ వ్రాత పుస్తకములు
తిరుగు ద్రిమ్మరి కేల ♦ దేవపూజ
ద్రవ్యలోభికి నేల ♦ దాతృత్వగుణములు
దొంగబంటుకు మంచి ♦ సంగతేల
తే. క్రూరజనులకు నీమీఁదఁ ♦ గోరి కేల
ద్రోహిపాపాత్మునకు దయా ♦ దుఃఖమేల ॥భూ॥ 63

టీ. భూష...దూర, వేదాక్షరంబులు=వేదవిద్య, వెఱ్ఱివానికిన్=మతిలేనివానికి, ఏల=ఎందులకు, మోటువానికి=మూఢునకు, మంచిపాటలు=ఇంపైనపాటలు, ఏల? పరతత్త్వబోధలు=జ్ఞానోపదేశములు, పసులకాపరికి=మూడలనుకాయువానికి, ఏల? విష్ణుకథలు=భగవంతునిగూర్చినకథలు, విటకానికి=జారునకు, ఏల? వ్రాతపుస్తకములు=వ్రాసినగ్రంథములు, వదరుశుంఠలకు=ప్రేలెడుమూఢులకు, ఏల? దేవపూజ, తిరుగుద్రిమ్మరికి=ఇచ్చవచ్చినట్లు తిరిగేవానికి, ఏల? ద్రవ్యలోభికిన్=ధనముమూటగట్టుకొనేవానికి, దాతృత్వగుణములు=ధర్మముసేయవలెననుతలంపులు, ఏల? దొంగబంటుకు=దొంగసేవకునకు, మంచిసంగతి, ఏల? క్రూరజనులకు=దుర్మార్గులకు, నీమీఁదకోరిక=నీయందుభక్తి, ఏల? ద్రోహి=మోసముచేయు, పాపాత్మునకు=పాపకర్మునకు, దయాదుఃఖమేల=దయయును, విచారమెందులకు?

తా. ఓనరసింహా! వెఱ్ఱివానికి వేదవిద్య, మోటువానికిమంచిపాటలు, పసులకాపరికిజ్ఞానోపదేశములు, జారునకువిష్ణుకథలు, వదరుపోతునకు పుస్తకములు, ఇచ్చవచ్చినట్లుతిరిగేవానికి దేవపూజ, లోభికిదానగుణములు, దొంగ

సేవకుననుమంచిసంగతులు, మోసములుచేయుపాపకర్మనకుదయాదుఃఖములు, ఎట్లు సందర్భములుగావో అట్లే చెడ్డమనుష్యులకు నీయందుభక్తియుండదు.

సీ. నాతండ్రి నాదాత ♦ నాయిష్టదైవమా
నన్ను మన్ననసేయు ♦ నారసింహా
దయయుంచు నామీఁదఁ ♦ దప్పులన్ని క్షమింపు
నిగమగోచర నాకు ♦ నీవె దిక్కు
నే దురాత్ముఁడనంచు ♦ నీ మనంబునఁ గోప
గింపబోకుము స్వామి ♦ యెంతకైన
ముక్తిదాయక నీకు ♦ మ్రొక్కినందుకు నన్ను
గరుణించి రక్షించు ♦ కమలనాభ

తే. దండి దొరవంచు నీవెంటఁ ♦ దగిలినాను
నేఁడు ప్రత్యక్షమై నన్ను ♦ నిర్వహింపు ॥భూ॥ 64

టీ. భూష...దూర, నాతండ్రి! నాదాత=నాకోర్కెలుదీర్చువాఁడా! నాయిష్టదైవమా = నాకిష్టమైనదేవుఁడా! నన్ను, మన్ననసేయు=క్షమించునటువంటి, నారసింహా=ఓనరసింహమూర్తీ! నామీఁదఁన్=నాయందు, దయయుంచు=కరుణయుంచుము, తప్పులన్ని క్షమించు=నేరములన్నిటినిమన్నింపుము, నిగమగోచర=వేదములందు తెలియబడువాఁడా! నీవె, నాకుదిక్కు=నాకు, రక్షకుఁడవు, నే=నేను, దురాత్ముఁడనంచు=దుర్రాత్ముఁడనంచు=పాతకుడనని, నీమనంబునన్=నీమనస్సున, ఎంతకైనన్=ఏమాత్రమైననుకోపగింపబోకుముస్వామి=కోపించకుతండ్రీ! ముక్తిదాయక=మోక్షమునిచ్చువాఁడా! నీకుమ్రొక్కినందుకు=నీకునమస్కరించినందులకు, నన్నున్=నన్ను, కరుణించి=దయయుంచి, రక్షించు=కాపాడుము, కమలనాభ=నాభియందు గమలముగలవాఁడా! దండిదొరవంచు=గొప్పప్రభువుపని, నీవెంటఁ దగిలినాను=నిన్నువెంబడించితిని, నేఁడు=ఇప్పుడు, ప్రత్యక్షమై=కనఁబడి నన్నునిర్వహింపు=నన్నుకృతార్థునిచేయుము.

తా. ఓనరసింహా! నాతండ్రి! నాదాత! నాయిష్టదైవమా! నారసింహా! నన్ను మన్నింపుము; నిగమగోచరా! నామీఁదదయయుంచి తప్పు లుక్షమించుము. నాకునీవేదిక్కు; నేదుర్మార్గుఁడనని నీమదిలో నేమాత్రమును కోపగింపకుము. నీకు మ్రొక్కెదను. కరుణించిరక్షింపుము; కమలనాభా! గొప్పప్రభువుడవని నీవెంటాడితిని; ఈరోజున కనబడి నన్ను కృతార్థునిజేయుము.

సీ. వేమారు నీకథల్ ♦ వినుచునుండెడి వాఁడు
పరుల ముచ్చటమీఁద ♦ భ్రాంతిపడఁడు
అగణితంబుగ నిన్నుఁ ♦ బొగడనేర్చిన వాఁడు
చెడ్డమాటను నోటఁ ♦ జెప్పఁబోఁడు
ఆసక్తిచేత ని ♦ న్ననుసరించెడివాఁడు
ధనమదాంధుల వెంటఁ ♦ దగులఁబోఁడు
సంతసంబున నిన్ను ♦ స్మరణఁ జేసెడివాఁడు
చెలఁగి నీచులపేరు ♦ దలఁపఁబోఁడు
తే. నిన్ను నమ్మినభక్తుండు ♦ నిశ్చయముగఁ
గోరి చిల్లర దైవముల్ ♦ గొల్వఁబోఁడు ॥భూ॥ 65

టీ. భూష...దూర, నీకథల్=నీపుణ్యచరిత్రములు, వేమారు=అనేకపర్యాయములు, వినుచునుండెడివాఁడు=ఆలకించెడివాఁడు, పరులముచ్చట మీఁదన్ = లౌకుల సంభాషణలయందు, భ్రాంతిపడఁడు=ఆశపడఁడు, నిన్నుక్, అగణితంబుగ=లెక్కపెట్టలేనన్నిమారులు, పొగడనేర్చినవాఁడు=కొనియాడగలిగినవాఁడు, నోటక్=నోటితో, చెడ్డమాటలు, చెప్పబోఁడు, ఆసక్తిచేత=కోర్కెచేత, నిన్ను, అనుసరించెడివాఁడు=విడువనివాఁడు, ధనమద=ధనముచేగల్గిన మదముచేత, అంధుల=కండ్లుగానరానివారల, వెంటక్=వెంబడిని, తగులఁబోఁడు=వెళ్ళజాలఁడు, సంతసంబున నిన్ను=నిన్ను సంతో

షముతో, స్మరణచేసెడివాఁడు=స్మరించెడువాఁడు, చెలఁగి=ఉత్సాహముతో, నీచులపేరుం=చెడ్డవారలపేరును, తలఁపబోఁడు=తలంపడు, నిన్ను నమ్మిన, భక్తుండు, నిశ్చయముగ=నిజముగా, కోరి=కోరుకొని, చిల్లరదైవముల్=చిన్నచిన్న దేవతలను, కొల్వఁబోఁడు=సేవింపఁడు.

తా. ఓనరసింహా! నిత్యమును నీకథలు వినెడివాఁ డితరుల సంగతులను వినఁడు. అనేకసార్లు నిన్ను కొనియాడువాఁడు చెడుమాటలను చెప్పఁడు. కోరికతో నీవెంటబడి తిరుగువాఁడు ధనముబాంధులవెంట వెళ్ళఁడు. సదా నిన్ను స్మరించువాఁడు నీచులను తలఁపఁడు. నిజముగా నిన్నునమ్మినభక్తుఁడు యితరదైవముల సేవింపఁడు.

సీ. నే నెంత వేఁడిన ♦ నీ కేల దయరాదు
పలుమాఱు పిలిచినఁ ♦ బలుకవేమి
పలికిన నీకున్న ♦ పదవేమి వోవు నీ
మోమైనఁ బొడచూప ♦ వేమినాకు
శరణుఁ జొచ్చినవాని ♦ సవరింపవలెఁగాక
పరిహసించుట నీకు ♦ బిరుదుగాదు
నీ దాసులను నీవు ♦ నిర్వహింపక యున్న
బరులెవ్వరగుదురు ♦ పంకజాక్ష
తే. దాత దైవంబు తల్లియుఁ ♦ దండ్రి నీవె
నమ్మియున్నాను నీపాద ♦ నలినములను ॥భూ॥ 66

టీ. భూష...దూర, నేను, ఎంతవేఁడిన=ఎంతప్రార్థించినను, నీకు, ఏలదయరాదు=ఎందుకుదయరాదు, పలుమాఱు=అనేకపర్యాయములు, పిలిచినన్=పిలిచినను, పలుకవేమి=మాటలాడవేమి, పలికినన్=మాటలాడినయెడల, నీకున్న=నీకుగల, పదవి=గౌరవము, ఏమిపోవును? నీ మోమైనన్=నీముఖమైనను, నాకు, పొడచూపవేమి=కనుబడవేల, శరణుచొచ్చినవాని=

వేఁడుకొన్నవారిని, సవరింపవలెఁగాక=సరియైనమార్గమున నుంచవలెనుగాని, పరిహరించుట=వదలిపెట్టుట, నీకు, ఓరుదుగాదు=గొప్పతనముగాదు, నీదాసులను, నీవు, నిర్వహింపకయున్నఁ=భరింపనిచో, పరులు=ఇతరులు, ఎవ్వరగుదురు=ఎవరురక్షింతురు? పంకజాక్ష=పద్మములవంటి నేత్రములుగలవాఁడా! దాత=ఇచ్చువాఁడవును, దైవంబు=భగవంతుఁడవును, తల్లియు, తండ్రియు, ఈవె=నీవేసుమా! నీపాదనలినములను=నీపాదపద్మములను, నమ్మియున్నాను=నమ్ముకొనియుంటిని.

తా. ఓనరసింహప్రభూ ! నేనెంతవేడుకొన్నను నీకుదయలేదు. ఎన్నిమారులు పిలిచినను పలుకవు. పల్కిన నీమర్యాదపోవునా? నీమొగమైన నొకమారు చూపుము. రక్షింపుమని వచ్చినవారిని రక్షించుటన్యాయముగాని వదలుట గొప్పతనముకాదు. నీదాసులను నీవే రక్షింపవలయునుగాని యితరులురక్షింపరు. నీవే నాకు తల్లివని తండ్రివని సమస్తమని నమ్మియున్నాను.

సీ. వేదముల్ చదివెడు ♦ విప్రవర్యుండైన
రణము సాధించెడు ♦ రాజునైన
వర్తక కృషికుఁడౌ ♦ వైశ్యముఖ్యుండైన
బరిచరించెడి శూద్ర ♦ వర్యుఁడయిన
మెచ్చు ఖడ్గముఁబట్టి ♦ మెఱయు మ్లేచ్ఛుండైన
ప్రజల కక్కఱపడు ♦ రజకుఁడైన
చర్మ మమ్మెడి హీన ♦ చండాల నరుఁడైన
నీమహీ తలమందు ♦ నెవ్వఁడైన
తే. నిన్నుఁ గొనియాడుచుండెనా ♦ నిశ్చయముగ
వాఁడు మోక్షాధికారి యౌ ♦ వసుధలోన ॥భూ॥ 67

టీ. భూష... దూర, వేదముల్ చదివెడు=వేదములనుచదువునట్టి, విప్రవర్యుండైన=బ్రాహ్మణోత్తముఁడయినను, రణము=యుద్ధము, సాధించెడు=

చేసెడు, రాజులైన, వర్తకకృషికుఁడో=వర్తకమునందు కృషినిసలుపువాఁడగు, వైశ్యముఖ్యుండైనన్=కోమటులలో గొప్పవాఁడయినను, పరిచరించెడి=సేవజేసెడు, శూద్రవర్యుఁడైన=మంచిశూద్రుఁడయినను, మెచ్చుఖడ్గముఁబట్టి=వాఁడియైనకత్తిని చేబూని, మెఱయు=అతిశయించు, మ్లేచ్ఛుడైనన్=తురకవాఁడైనను, ప్రజలకు=జనులకు, అక్కఱపడు=ఉపయోగపడునట్టి, రజకుఁడైన=చాకలివాఁడైనను, చర్మము=తోలును, అమ్మెడి=అమ్ముకొనెడి, హీన=నీచమయిన, చండాలనరుఁడైనన్=మాలవాఁడైనను, ఈమహీతలమందున్=ఈభూలోకమందు, ఎవ్వఁడైనన్, నిన్నున్, కొనియాడుచుండెనా=పొగడుచున్నచో, నిశ్చయముగ, వాఁడు, ఈవసుధలోన=ఈలోకమందు, మోక్షాధికారి=ముక్తినిపొందతగినవాఁడు.

తా. నరసింహా! వేదములనుజదువుబ్రాహ్మణుడుగాని, యుద్ధములను సాధించురాజుగాని, వర్తకముజేయుకోమటిగాని, వీరిని సేవించు శూద్రుడుగాని, కత్తితో సర్వదా పోరాడుతురకగాని, జనుల కుపయోగపడు చాకలిగాని, తోళ్ళనమ్ముకొను మాలగాని భూమిలో నెవ్వడైనను నిన్ను పొగడుచుండినవాడు ముక్తినిబొందదగినవాడు. నీకు అంతయుసమానమే.

సీ. సకల విద్యలునేర్చి ♦ సభ జయింపఁగవచ్చు
బూర్ణుడై రణమందుఁ ♦ బోరవచ్చు
రాజరాజై పుట్టి ♦ రాజ్యమేలఁగ వచ్చు
హేమ గోదానంబు ♦ లియ్యవచ్చు
గగనమందున్న చు ♦ క్కలనెంచుకొన వచ్చు
జీవరాసుల పేళ్లు ♦ చెప్పవచ్చు
నష్టాంగయోగము ♦ లభ్యసింపఁగ వచ్చు
మేకరీతిగ నాకు ♦ మెసగవచ్చు
తే. దామరసగర్భ హరపురం ♦ దరులకైన
నిన్ను వర్ణింపఁ దరమౌనె ♦ నీరజాక్ష ॥ భూ॥ 68

టీ. భూష...దూర, నీరజాక్ష=పద్మములవంటికన్నులుగలవాఁడా! సకలవిద్యలు నేర్చి=అన్ని విద్యలు నేర్చుకొని, సభజయింపఁగవచ్చుఁ=సభల యందు జయము పొందవచ్చును, పూర్ణుఁడై=సమర్థుఁడై, రణమునందుఁ=యుద్ధమునందు, పోరవచ్చు=పోరాడవచ్చును, రాజరాజై పుట్టి=చక్రవర్తియైపుట్టి, రాజ్యము, ఏలగవచ్చు, హేమ=బంగారమును, గో=ఆవులను, దానంబులు, ఇయ్యవచ్చు, గగనమందున్న=ఆకాశమందున్నటువంటి, చుక్కలఁ=నక్షత్రములను, ఎంచుకొనవచ్చుఁ=లెక్కఁబెట్టవచ్చును, జీవరాసుల పేళ్లు=ప్రాణికోటులపేర్లు, చెప్పవచ్చుఁ, అష్టాంగయోగముల్=ఎనిమిదియోగాభ్యాసములు, అభ్యసింపఁగవచ్చుఁ=నేర్చుకొనవచ్చును, మేఁకరీతిగఁ=మేకవిధముగా, ఆకు మెసగవచ్చుఁ=ఆకులుతినవచ్చును, తామరసగర్భ=బ్రహ్మకును, హర=శివునకును, పురందరులకైన=ఇంద్రులకైనను, నిన్ను, వర్ణింపఁ=పొగడుటకు, తరమా సె=శక్యముగునా?

తా. ఓనరసింహా! విద్యలనన్నిటిని నేర్చి సభలందుజయ మొందవచ్చు, యుద్ధములలో గెలుపొందవచ్చును. చక్రవర్తియై భూమియంతయు నేలవచ్చు. బంగారమును, ఆవులను, దానమియ్యవచ్చును. నక్షత్రముల లెక్కింపవచ్చు. జంతుజాలములపేర్లనుచెప్పవచ్చు. మేకవలె ఆకులను దినవచ్చును. యోగంబుల నభ్యసింపవచ్చునుగాని నిన్ను దెలిసికొని వర్ణించుట కాబ్రహ్మేశ్వరఇంద్రాదులకుగూడ సాధ్యముకాదు.

సీ. నరసింహ నీవంటి ◆ దొరను సంపాదించి
కుమతి మానవుని నేఁ ◆ గొల్వఁజాల
నెక్కువైశ్వర్యంబు ◆ లియ్యలేకున్నను
బొట్టకు మాత్రము ◆ పోయరాదె
ఘనముగాదిది నీకు ◆ కలవునఁ బోషింపఁ
గష్టమెంతటి స్వల్ప ◆ కార్యమయ్యె

పెట్టఁ జాలక యేల ♦ భిక్షమెత్తించెదు
నన్ను బీదను జేసి ♦ నా వదేమి
తే. అమల కమలాక్ష నే నిట్లు ♦ శ్రమపడంగఁ
గన్నులకుఁ బండువై నీకుఁ ♦ గానఁబడునె ॥భూ॥ 69

టీ. భూష...దూర, నరసింహ, నీవంటిదొరను, సంపాదించి, కుమతి మానవులన్=చెడ్డబుద్ధిగలమనుష్యులను, ఏన్=నేను, కొల్వఁజాలన్=సేవింప నేరను, ఎక్కువైశ్వర్యంబుల్=విశేషసంపదలు, ఇయ్యలేకున్నను=ఇవ్వజాల కపోయినను, పొట్టకుమాత్రము, పోయరాదె=ఇయ్యరాదా ! ఇది=ఈమాత్ర ము, నీకు, ఘనముగాదు=గొప్పకాదు, కఁఅవునన్=నాకులేనప్ఁడు, పోషింప న్=రక్షించుట, కష్టము, ఎంతటిస్వల్పకార్యమయ్యె=ఎంతచిన్నపనోగద, పెట్టజాలక=పెట్టలేక, భిక్షము=ముష్టి, ఏలఎత్తించెదు=ఎందుకెత్తించెదవు, నన్ను, బీదను=లేనివానిని, జేసినావు, అదేమి=అదెందులకు, అమలకమ లాక్ష=తెల్లదామరవంటికన్నులుగలవాఁడా ! నేను,ఇట్లు, శ్రమపడంగన్= కష్టములుపడుచుండగా ! నీకన్నులకు, పండువై=ఆనందమై, కానఁబడునె= కనపడుచున్నదాఏమి?

తా. ఓనరసింహా ! నీవంటిప్రభువును సంపాదించి నేను చెడ్డమానవు లను సేవింపలేను. ఎక్కువసంపద లీయలేకున్నను, పొట్టకుమాత్రమిమ్ము. నాకులేనప్పుడు పోషించుట నీకిదిగొప్పకాదు. చిన్నపని. నన్ను దరిద్రునిజేసి పెట్టలేక ఎందుచేబిచ్చమెత్తించెదవు? నేనిట్లు కష్టములపడుచుండగా నీకు కన్నులపండువుగా కనబడుచున్నదాఏమి?

సీ. వనజాతనాభ నీ ♦ వంకఁ జేరితి నేను
గట్టిగా ననుఁ గావు ♦ కావుమనుచు
వచ్చినందుకు వేగ ♦ వరము లియ్యక కాని
లేవఁబోయిన నిన్ను ♦ లేవనియ్యఁ

గూర్చుండబెట్టిఁ నీ ♦ కొంగు గట్టిగఁ బట్టి
పుచ్చుకొందును జూడు ♦ భోగిశయన
యీవేళ నీకడ్డ ♦ మెవరు వచ్చినఁగాని
వారికైనను లొంగి ♦ వడఁకబోను
తే. గోపగాఁడను నీవు నా ♦ గుణము తెలిసి
యిప్పుడే నన్ను రక్షించి ♦ యేలుకొమ్ము ॥భూ॥ 70

టీ. భూష... దూర, వనజాతనాభ=నాభియందుపద్మముగలవాఁడా! నేను, గట్టిగా=తప్పక, ననుఁ=నన్ను, కావుకావుమనుచు=రక్షించురక్షించుమనుచు, నీవంకఁ=నీదగ్గరకు, చేరితి, వచ్చినందుకు=నీకడకువచ్చినందుకు, వేగ=వెంటనే, వరములు=కోరికలు,ఇయ్యకకాని=ఇవ్వనిదే, లేవఁబోయిన=లేచుటకుప్రయత్నించినచో, నిన్ను, లేవనియ్య, భోగిశయన=శేషశాయీ! కూర్చుండఁబెట్టి=లేవనీయక, నీకొంగు=నీబట్టకొంగు, గట్టిగబట్టి, పట్టుకొని, పుచ్చుకొందును, చూడు=చూడుము, ఈవేళ=ఈరోజున, నీకు, ఎవరు, అడ్డము, వచ్చినకాని=వచ్చిననుసరే, వారికైనను, లొంగి=వశమై, వడఁకఁ బోను=జడియను, కోపగాఁడను=కోపముగలిగినవాఁడను, నీవు, నాగుణము తెలిసి = నాకోపగుణము తెలిసికొని, ఇప్పుడే=ఈసమయముననే, నన్ను, రక్షించి, ఏలుకొమ్ము=పాలింపుము.

తా. ఓనరసింహా! నన్ను కాపాడుమని నీదగ్గఱకుఁజేరితిని చేరినందులకు వెంటనే కోర్కెలనియ్యనిదే లేపబోయినను నిన్ను లేపనియ్యను. నిన్ను కూర్చుండబెట్టి నీబట్టకొంగుపట్టుకొని వరములు పుచ్చుకొందును చూడుము. ఈరోజున నీకెవ్వరడ్డమువచ్చినను వారికి జడియను.. కోపముగలవాఁడను. నీవు నాకోపగుణము తెలిసి యిప్పుడే నన్ను రక్షించి యేలుకొమ్ము.

సీ. ప్రహ్లాదుఁ డేపాటి ♦ పైఁడి కానుక లిచ్చె
మదగజం బెన్నిచ్చె ♦ మౌక్తికములు

నారదుం డెన్నిచ్చె ♦ నగలు రత్నంబు ల
హల్య నీ కే యగ్ర ♦ హారమిచ్చె
నుడుత నీ కేపాటి ♦ యూడిగంబులు చేసె
ఘన విభీషణుఁ ♦ డేమి కట్నమిచ్చె
బంచపాండవు లేమి ♦ లంచమిచ్చిరి నీకు
ద్రౌపది నీ కెంత ♦ ద్రవ్యమిచ్చె
తే. నీకు వీరంద అయినట్లు ♦ నేను గాన
యెందు కని నన్ను రక్షింప ♦ విందువదన ॥భూ॥ 71

టీ. భూప...దూర, ప్రహ్లాదుఁడు, పైడికానుకలు=బంగారుబహుమతులు, ఏపాటి=ఎన్ని, ఇచ్చె, మౌక్తికములు=మంచిముత్యములు, మదగజంబు=మదపుటేనుగ, ఎన్నిచ్చె=ఎన్నిచ్చినది, నగలు, రత్నంబులు, నారదుఁడు=నారదముని, ఎన్నిచ్చె, అహల్య=గౌతమునిభార్య, నీకు, ఏఅగ్రహారము=ఏయూరు, ఇచ్చె, ఉడుత, నీకు, ఏపాటి, ఊడిగంబులుచేసె=సేవలుచేసినది, ఘనవిభీషణుడు, ఏమికట్నము, ఇచ్చె, పంచపాండవులు=పాండవులైదుగురు ఏమి, నీకు, లంచము, ఇచ్చిరి, ద్రౌపది=పాండవులభార్య, నీకు, ఎంతద్రవ్యము=ఎంతడబ్బు, ఇచ్చె, నీకు, వీరందఅయినట్లు=ప్రహ్లాదుడు మొదలగువారు బంధుగులైనట్లు, నేను, కాన=భక్తుడనుకానా! ఇందువదన=చంద్రబింబము వంటిమొగముకలనరసింహా! నన్ను, ఎందుకని=ఏకారణముచేత, రక్షింపవు?

తా. ఓనరసింహస్వామీ! హిరణ్యకశ్యపునికొడుకును నీభక్తులలో ముఖ్యుడునగు ప్రహ్లాదుడు నీకేమిబహుమతులిచ్చినాడని యతనిని తండ్రి బాధింపుచుండ రక్షించితివి. గజేంద్రుడు నీకెన్నిమంచిముత్యములనిచ్చినాడని మొసలినుండి విడిపించితివి. నారదుడు నీకేమినగలురత్నములు యిచ్చినాడని నీభక్తులలోఁజేర్చికొంటివి. అహల్య నీకేమి యగ్రహారమిచ్చినదని రాయిగా పడియున్న నామెకు నిజరూపమిచ్చినావు. ఉడుత నీకేమాత్రము సేవలుచేసినదని దానివీపును దువ్వితివి. విభీషణుడేమికట్నమిచ్చినాడని యతడు

వుకు తమ్ముఁడైనను నీసేవచేయఁ గాంచి తివి. పాండవు లేమిలంచమిచ్చినారని వారికి భారతయుద్ధమునందు గెల్పు దెప్పించితివి. ద్రౌపది నీకేమిడబ్బిచ్చిన దని నా మెబట్టలు దుశ్శాసనుఁడొలుచుచుండ నక్షయముగాచేసి రక్షించితివి. వీరందఱిని కాపాడినట్లు నన్నేల కాపాడవు.

సీ. వాంఛతో బలిచక్ర ♦ వర్తి దగ్గఱఁ జేరి
భిక్ష మెత్తితి వేల ♦ బిడియపడక
యడవిలో శబరి ది ♦ య్యాని ఫలా లందియ్యఁ
జేతు లొగ్గితి వేల ♦ సిగ్గుపడక
వేడ్కతో వేవేగ ♦ విదురు నింటికి నేఁగి
విందుగొంటివ దేమి ♦ వెలితిపడక
నడుకు లల్పము కుచే ♦ లుఁడు గణించుక దేర
బొక్కసాగితి వేల ♦ లెక్కగొనక
తే. భక్తులకు నీవు పెట్టుట ♦ భావ్యమౌను
వారి కాసించితివి తిండి ♦ వాఁడవగుచు ॥భూ॥ 72

టీ. భూష...దూర, వాంఛతో=కోర్కెతో, బలిచక్రవర్తి దగ్గఱన్, చేరి=సమీపించి, బిడియపడక=సిగ్గుజెందక, భిక్షము, ఎత్తితివి, ఏల=ఎందుకు, శబరి, అడవిలో, తియ్యాని, ఫలాలు=పండ్లు, అందియ్య=ఈయగా, చేతులు, సిగ్గుపడక, ఒగ్గితివేల=పట్టితివెందుకు, విదురుని, యింటికిన్, ఏగి=వెళ్ళి, వేడ్కతో=సంతోషముతో, వెలితిపడక=తేలికపడక, విందు గొంటివి=భోజనమున కంగీకరించితివి, అదేమి=అదెందులకు, కుచేలుడు, అడుకులు=అటుకులు, అల్పము=తక్కువగా, గణించుక దేరన్=సంపాదించుకొని తీసుకరాగా, లెక్కగొనక=సరకుచేయక, ఏల=ఎందుకు, బొక్కసాగితివి=తిన మొదలుపెట్టితివి, భక్తులకు, నీవు, పెట్టుట, భావ్యమౌను=తగియుండును, తిండివాఁడవు=తిండిపోతువు, అగుచు, వారికి=ఆభక్తులకు, ఆశించితివి=ఆశపడితివి.

తా. ఓ నరసింహస్వామీ! నీవు వామనావతారంబున బలిచక్రవర్తి కడ కరిగి మూడడుగుల భూమిని దానమడిగికొంటివి. సిగ్గుపడక నీవు ముష్టి యెత్తి తెందులకు. రామావతారంబున నరణ్యావాసము చేయుకాలమున మాల పిల్లయగు శబరియెంగిలిచేసిన ఫలములనీయగా సిగ్గులేక వానినెందులకు తింటివి. అది నీవంటివారు చేయతగినదికాదుకదా? కృష్ణావతారంబున కౌరవుల కును, పాండవులకును సంధిచేయతలంపున, హస్తినాపురంబున కరిగి రాజబంధువులెందరో యుండ శూద్రస్త్రీకి బుట్టిన విదురునింటిలో భోజనము చేసితివి. తక్కువకులమువాడుకదాయని యాలోచింపనైతివి. నీచిన్ననాటి స్నేహితుడును దరిద్రుడును నగు కుచేలుఁడు నిన్నుజూచుటకు వచ్చినపుడు బీద వాడై తినుటకు దెచ్చుకొనిన యటుకులను కుచేలుని నాకేమి తెచ్చితివని యడిగి మఱితింటివి. నీవు నీభక్తులైనవారికి బెట్టుట న్యాయముకాని దరిద్రముతో నుండువారలకడ నడిగికొని తింటివి. ఇందువలన నీవు తిండిపోతువని తెలుచున్నది.

సీ. స్తంభమం దుదయించి ♦ దానవేంద్రుని ద్రుంచి
కరుణతోఁ బ్రహ్లాదు ♦ గాచినావు
మకరిచేఁ జిక్కి సా ♦ మజము దుఃఖింపంగ
గృపయుంచి వేగ ర ♦ క్షించినావు
శరణంచు నావిభీ ♦ షణుఁడు నీచాటున
జొచ్చినప్పుడె లంక ♦ నిచ్చినావు
ఆకుచేలుఁడు చేరెఁ ♦ డటుకు లర్పించిన
బహుసంపద లిచ్చి ♦ పంపినావు

తే. వారివలె నన్నుఁ బోషింప ♦ వశముగాదె
యంత వలపక్షమేల శ్రీ ♦ కాంతనీకు ॥భూ॥ 73

టీక. భూప...దూర, శ్రీ=లక్ష్మీదేవికి, కాంత=ప్రియుఁడైనవాఁడా స్తంభమందు, ఉదయించి=పుట్టి, దానవేంద్రునిన్=రాక్షసరాజగు హిరణ్యకశ్యపుని, త్రుంచి=చంపి, కరుణతోన్=దయతోఁడ, ప్రహ్లాదున్=ప్రహ్లాదుని, కాచినావు=రక్షించినావు, మకరిచేన్=మొసలిచే, చిక్కి=పట్టుపడి సామజము=ఏనుగు, దుఃఖింపంగన్=ఏడ్వగ, కృపయుంచి=దయయుంచి, వేగ=వెంటనే, రక్షించినావు=కాపాడితివి, శరణంచున్=రక్షింపుమని, ఆ విభీషణుఁడు, నీచాటునన్=నీమరుగున, చొచ్చినపుఁడే, లంకాపురమును, యిచ్చినావు=పట్టముఁగట్టితివి, ఆకుచేలుఁడు, చేరెడటుకులు=పట్టెడటుకులు, అర్పించిన=ఈయఁగా, బహుసంపదలన్=అనేకభాగ్యములను, యిచ్చి, పంపినావు, వారివలె=వారివిధముగా, నన్నున్, పోషింప=కాపాడుటకు, వశముగాదె=శక్యముగాదా, నీకు, అంతపలపక్షము=అంతపక్షపాతము ఏల=ఎందుకు.

తా. ఓ నరసింహస్వామీ! రాక్షసరాజైన హిరణ్యకశ్యపుడు తన కొడుకులలో నొక్కఁడగు ప్రహ్లాదుడు యెల్లప్పుడు తనకు విరోధియైన హరియందు భక్తికలవాఁడై యుండుటయు నన్నిచోటులందు హరికలడని చెప్పుటయు విని యాస్తంభమునందు చూపగలవాయని యడుగ నందుండి నరసింహరూపముతో వెడలివచ్చి రాక్షసరాజును చంపి ప్రహ్లాదుని రక్షించితివి. గజరాజు మొసలిచే పట్టుబడి రక్షింపుమని ప్రార్థింప నామొసలిని జంపి గజేంద్రుని విడిపించితివి. అన్నగారైన రావణునకు పరస్త్రీయగు సీత నెత్తుకొనివచ్చుట పాపమనిబోధించి యతనిచే నిలువెడలగొట్టబడి వచ్చి నీశరణుగోరిన విభీషణునకు రావణునిజంపి లంకరాజ్యమిచ్చినావు, కుచేలుడు గుప్పెడటుకులు నీకియ్య లెక్కలేనన్ని భాగ్యముల నతనికిచ్చితివి. వారివలెనె నన్నుకూడ నాకోరికలనిచ్చి కాపాడుము. లేనిచో నీవు పక్షపాతము కలవాఁడవగుదువు.

సీ. వ్యాసుఁడే కులమందు ♦ వాసిగా జన్మించె
విదురుఁడే కులమందు ♦. వృద్ధిబొందె

కర్ణుఁడేకులమందు ♦ ఘనముగా వర్ధిల్లె
నావసిష్ఠుం డెట ♦ నవతరించె
నింపుగా వాల్మీకుఁ ♦ డేకులంబున హెచ్చె
గుహుఁడను పుణ్యుఁడే ♦ కులమువాఁడు
శ్రీశుకుఁ డెచ్చటఁ ♦ జెలఁగి జన్మించెను
శబరియే కులమందు ♦ జన్మమొందె
తే. నేకులంబున వీరంద ♦ ఱెచ్చినారు
నీకృపాపాత్రులకు జాతి ♦ నీతులేల ॥భూ॥ 74

టీ. భూప...దూర, వ్యాసుఁడు=వేదవ్యాసమహాముని, ఏకులమందు=ఏజాతియందు, వాసిగా=ప్రఖ్యాతిగా, జన్మించె=పుట్టెను, విదురుఁడు, ఏకులమందు, వృద్ధిఁబొందె=పెరిగెను, కర్ణుఁడు, ఏకులమందు, ఘనముగా వర్ధిల్లె=గొప్పగా పెరిగెను, ఆవసిష్ఠుండు=ఆవసిష్ఠమహాముని, ఎటన్=ఏకులమున, అవతరించెన్=పుట్టెను, ఇంపుగా=చక్కఁగా, వాల్మీకుఁడు=వాల్మీకి మహర్షి, ఏకులంబునన్, హెచ్చె=అతిశయించెను, గుహుఁడనుపుణ్యుఁడు=గుహుఁడనేపుణ్యాత్ముఁడు ఏకులమువాఁడు=ఏజాతివాఁడు, శ్రీశుకుఁడు=శుకమహర్షి, ఎచ్చటన్=ఏకులమందున, చెలఁగి=అతిశయించి, జన్మించెను=పుట్టెను, శబరి, ఏకులమందు, జన్మమొందెన్=పుట్టెను, వీరందఱు=ఈపైన చెప్పినవారందరును, ఏకులంబున=ఏయేవంశములందు, ఎచ్చినారు=వృద్ధిఁబొందిరి, నీ=నీయొక్క, కృపాపాత్రులకు=దయకుతగినవారలకు, జాతి నీతులు=కులగుణములు, ఏల=ఎందులకు?

తా. ఓనరసింహస్వామీ! నాలుగువేదములను పదునెనిమిదిపురాణములను సంస్కృతమున భారతమును రచించినవ్యాసుడు పల్లెస్త్రీయగు సత్యవతికి పరాశరమహర్షివలనజనించియు నీకుభక్తుడయ్యెను. వ్యాసునకు శూద్రస్త్రీయందుపుట్టిన విదురుడు నీకుభక్తుడు స్నేహితుడుగూడనయ్యెను. సూర్యునివలన కుంతీదేవికి రహస్యముగా కన్యగానున్నపుడుపుట్టి శూద్రు

నింటపెరిగిన కర్ణుడు శౌర్యధైర్యగాంభీర్యాదిగుణంబులు గలిగినీభక్తుడయ్యెను దేవలోకమున భోగస్త్రీయైన ఊర్వశికి సూర్యునివలనబుట్టి మాలస్త్రీయగు అరుంధతిని పెండ్లాడిన వసిష్ఠుడు నీభక్తుడై మునియై సూర్యకులమునకు పురోహితుడయ్యెను. బాల్యమునందు చెడుస్నేహములచేసి బోయస్త్రీని పెండ్లాడి దొంగతనములు హింసలుచేసి బ్రతుకు వాల్మీకి నీభక్తుడై రామాయణమును వ్రాసి కీర్తినొందెను. గుహుడుబోయకులంబునబుట్టియు నిన్ను సేవించి నీభక్తుడయ్యెను. వ్యాసునకు ఘృతాచియను వేశ్యయందుపుట్టిన శ్రీశుకుడు నీభక్తుడై బ్రహ్మజ్ఞానియనిపించుకొనెను కిరాతకులమందుపుట్టినశబరి నీభక్తురాలై యెంగిలిపండ్లను నీచేతతినిపించినది. వీరందరు నీచకులంబులందు తక్కువపుట్టుకపుట్టినను నీదయవలన గొప్పవారైరి. నీవెవరిమీద దయచూపుదువో వారు నీచకులమువారైనను గొప్పవారగుదురు. వారినందఱ దయజూచినట్లే నన్నుగూడ చూడుము.

సీ. వసుధాస్థలంబునఁ ♦ వర్ణహీనుఁడుగాని
బహుళ దురాచార ♦ పరుఁడుగాని
తడసికాసియ్యని ♦ ధర్మశూన్యుఁడు గాని
చదువనేరనిమూఢ ♦ జనుఁడుగాని
సకలమానవులు మె ♦ చ్చని కృతఘ్నుఁడుగాని
చూడసొంపును లేని ♦ శుంఠగాని
యప్రతిష్ఠలకు లో ♦ నైన దీనుఁడు గాని
మొదటికే మెఱుఁగని ♦ మోటుగాని
తే. ప్రతిదినము నీదు భజనచే ♦ బరగునట్టి
వాని కేవంక లేదయ్య ♦ వచ్చుముక్తి ॥భూః 75

టీ. భూష...దూర, వసుధాస్థలంబునన్=భూమియందు, వర్ణహీనుఁడుగాని=కులముచెడినవాఁడుగాని, బహుళ=మిక్కిలి, దురాచారపరుఁడుగాని=చెడ్డయాచారములు చేయువాఁడైనను, తడసి=ఆలస్యముచేసి, కాసి

య్యని=ఒక్కకాసైనను యీయని, ధర్మకర్మాన్యుఁడుగాని=దాతృత్వములేని వాఁడైనను, చదువునేరని=చదువుకొనని, మూఢజనుఁడుగాని=మూర్ఖమనుష్యుఁడైనను, సకలమానవులు=జనులందరు, మెచ్చని=పొగడని, కృతఘ్నుఁడుగాని=విశ్వాసములేనివాఁడైనను, చూడఁగ=చూచుటకు, సొంపునులేని=మంచిఆకారమునులేని, శుంఠగాని=నీచుఁడైనను, అప్రతిష్ఠలకులోనైన=అగౌరములకులోనైన, దీనుఁడుగాని = దిక్కులేనివాడైనను, మొదటికి=అసలే, ఏమి=ఏమియు, ఎఱుగని=తెలియని, మోటుగాని=మొద్దువాడైనను, ప్రతిదినము=ప్రతిరోజును, నీదు=నీయొక్క, భజనచేఁత=సేవవలన, పరగు నట్టివానికి=ప్రవర్తిల్లువానికి, ఏవంకలేదయ్యా=ఎట్టిలోపమునులేదు, ముక్తి=మోక్షము, వచ్చు=కలుగును.

తా. ఓ నరసింహా! ఈభూమియందు, కులముచెడినవాడైనను, మిక్కిలిదుర్రాచారుఁడైనను, లోభియైనను, మూఢుఁడయినను, విశ్వాసహీనుఁడయినను, అందములేనిమోటువాడయినను, అపకీర్తిపాలయినదీనుఁడయినను, ఏమియు తెలియనిమోటువాడయినను, ప్రతిదినము నీసేవచే వర్తించెనేని యట్టివాని కేకొఱంతయులేదు. వానికిమోక్షముగలుగును.

సీ. ఇభకుంభములమీఁది ◆ కెగిరెడి సింగంబు
మెట్టునే కుఱుచైన ◆ మూషికమును
ననచూత పత్రముల్ ◆ నమలుచున్న పికంబు
గొఱుకునే జిల్లేడు ◆ కొనలు నోట
నరవింద మకరంద ◆ మనుభవించెడి తేఁటి
పోవునే పల్లేరు ◆ పూలకడకు
లలిత సూనరసాల ◆ ఫలముఁ గోరెడిచిల్క
మెసవునే భ్రమత ను ◆ మ్మెత్తకాయ
తే. నిలను సత్కీర్తనలు పాడ ◆ నేర్చునతఁడు
పరులకీర్తనఁ బాడునే ◆ యరసి చూడ ॥భూ॥ 76

టీ. భూష...దూర, ఇభ=ఏనుఁగులయొక్క, కుంభములమీఁదికి= కుంభస్థలములపైకి, ఎగిరెడిసింగంబు=దుముకునట్టిసింహము, కురుచైన=చిన్న దైన, మూషికమును=ఎలుకను, ముట్టునే=పట్టుకొనునా? నవచూతపత్ర ముల్=లేతమామిడిచిగుళ్ళను, నములుచున్న=తినుచున్న, పికంబు=కోకిల, జిల్లేడుకొనలు=జిల్లేడుచిగుళ్ళు, నోటన్=నోటితో, కొఱుకునే, అరవింద= తామరపూవునందలి, మకరందము=తేనెను, అనుభవించెడి=త్రాగునట్టి, తేఁటి=తుమ్మెద, పల్లేరుపూలకడకు=పల్లేరుపువ్వులదగ్గరకు, పోవునే=వెళ్లు నా? లలితమైన=మృదువైన, రసాలఫలమున్=మామిడిపండును, కోరెడి చిల్క=ఆసించేర్రామచిలుక, భ్రమతన్=ఆశతో, ఉమ్మెత్తకాయన్= ఉమ్మెత్తకాయను, మెసవునె=తినునా? ఇలను=భూమియందు, నీకీర్త నలు=నీగుణములు కూర్చినపాటలు, పాడనేర్చినతఁడు=పాడుట కలవాటుప డినవాఁడు, అరసిచూడ=విచారించిచూడగా. పరులకీర్తనల్=ఇతరులను గుఱించిన పాటలు, పాడునే=పాడునా?

తా. ఓ నరసింహా! ఏనుగు కుంభస్థలంబులను చీరి యామాంసమును దిను స్వభావముకల సింహము ఎలుకమీదికి పోనట్లు క్రొత్తమామిడి చిగుళ్ళ ను తినుటకలవాటుపడిన కోకిల జిల్లేడు చిగుళ్ళకాసింపనట్లు, పద్మములందలి తేనెద్రావు తుమ్మెద పల్లేరుపూలదగ్గర కేగనట్లు పండినమామిడిపండ్లదిను రామచిలుక ఉమ్మెత్తకాయవైపు చూడనటుల నీమీదిపాటలుపాడుకొనుట కలవాటుపడినవాడెవ్వడు ఇతరులమీది పాటలుగాని పద్యములుగాని మరే మిగాని పాడుటకు తలంపడు. ఇది నిశ్చయము.

సీ. సర్వేశ నీపాద ♦ సరసిజద్వయమందుఁ
జిత్తముంపగలేను ♦ జెదరకుండ
నీవైన దయయుంచి ♦ నిలచి యుండెడినట్లు
చేసి నన్నిపుడేలు ♦ సేవకుఁడను
వనజలోచన నేను ♦ వట్టిమూర్ఖుఁడ జుమ్మి
నీస్వరూపముఁ జూడ ♦ నేర్పు వేగ

తనకుమారున కుగ్గు ♦ తల్లిపోసిన యట్లు
భక్తిమార్గంబను ♦ పాలువోసి
తే. ప్రేమతో నన్ను బోషించి ♦ పెంచుకొనుము
ఘనత కెక్కించు నీదాస ♦ గణములోన ॥భూ॥ 77

టీక. భూష...దూర, సర్వేశ=సమస్తలోకములకు ప్రభువైన వాఁడా! నీపాద సరసిజద్వయమందుఁ=నీపాదపద్మముల జంటయందు, చెదరకుండ=చలింపకుండ, చిత్తము=మనస్సును, ఉంపఁగలేను=ఉంచలేను, నీవైనదయయుంచి, నిలిచియుండెడునట్లు చేసి, నన్ను, ఇపుడు, ఏలు=కాపాడుము, సేవకుఁడను=నీదాసుఁడను, వనజలోచన=పద్మములవంటి నేత్రములుగలవాఁడా! నేను, పట్టిమూర్ఖుఁడఁజుమ్మి=ఏమియు నెఱుంగని మూఢుఁడనుసుమా! నీస్వరూపముఁ=నీయాకారమును, వేగ=వెంటనే, చూడ=చూచుటకు, నేర్పు=నేర్పుము, తనకుమారునకు=తనబిడ్డకు, తల్లి, ఉగ్గుపోసిన యట్లు=ఉగ్గునుపోసినవిధముగా, భక్తిమార్గంబను=భక్తిమార్గమనెడి, పాలువోసి=పాలనుబోసి, ప్రేమతో=కరుణతో, నన్నుఁ, పోషించి, పెంచుకొనుము=పెద్దవానిగా చేసికొనుము, నీదాసగణములోనన్=నీభక్తవరులందరిలో ఘనతకు=గొప్పను, ఎక్కించు=తగినట్లు చేయుము.

తా. ఓ నరసింహా! సర్వేశా! నీపాదపద్మములందు నామనస్సు చెదరకుండ నుంచలేను. నీవైన దయయుంచి చెదరకుండునట్లుచేసి దాసుఁడను కావున నన్నిపుఁడేలుకొనుము. నేనేమియు నెఱుగని మూఢుడను సుమీ. నీయాకారమును చూచునట్లు వెంటనే నేర్పుము. తల్లి తనబిడ్డ కుగ్గుపోయునట్లు, నీభక్తిమార్గమనే పాలుపోసి ప్రేమతో నన్నుపోషించి పెంచుము. నీ భక్తకోటిలో నన్ను ఘనతకెక్కించుము.

సీ. జీమూతవర్ణ నీ ♦ మోముతో సరి రాక
కమలారి యతి కళం ♦ కమునఁబడియె

సొగసైన నీ నేత్ర ♦ యుగముతో సరిరాక
నళినబృందము నీళ్ళ ♦ నడుమఁ జేరెఁ
గరిరాజవరద నీ ♦ గళముతో సరి రాక
పెద్దశంఖము బొబ్బ ♦ పెట్టఁ దొడఁగె
శ్రీపతి నీదివ్య ♦ రూపుతో సరి రాక
పుష్పబాణుఁడు నీకుఁ ♦ బుత్రుఁడయ్యె
తే. నిందిరాదేవి నిన్ను మో ♦ హించి విడక
నీకుఁ బట్టమహిషి యయ్యె ♦ నిశ్చయముగ ॥భూ॥ 78

టీక. భూష...దూర, జీమూతవర్ణ=మేఘమువంటి నల్లని శరీరచ్ఛాయగలవాఁడా! నీమోముతో సరి రాక=నీముఖముతో సమానముగాఁజాలక, కమలారి=పద్మములకు శత్రువగు చంద్రుఁడు, అతికళంకమునఁ బడియె=పెద్దనల్లనిమచ్చగలవాఁడయ్యెను, సొగసైన=అందమైన, నీ నేత్రయుగముతో=నీరెండుకన్నులతోడను, సరిగాక=పోలికలేక, నళినబృందము=పద్మసమూహము, నీళ్ళనడుమన్=నీటిమధ్యను, చేరెన్=చేరెను, కరిరాజవరద=గజేంద్రునకు కోర్కెలనిచ్చినవాఁడా! నీగళముతో=నీకంఠముతో, సరిరాక, పెద్దశంఖము, బొబ్బ=పెద్దధ్వనిని, పెట్టఁదొడగెన్=చేయసాగెను, శ్రీపతి=లక్ష్మీదేవికిభర్తా! నీదివ్యరూపుతో=నీసుందరమగు స్వరూపముతో, సరి రాక పుష్పబాణుఁడు=మన్మథుఁడు, నీకు, పుత్రుఁడయ్యెన్=కుమారుఁడయ్యెను, ఇందిరాదేవి=లక్ష్మీదేవి, నిన్ను, మోహించి=ప్రేమించి, విడక=విడువక, నిశ్చయముగ=శాశ్వతముగ, నీకున్=నీకు, పట్టమహిషి=పట్టపుదేవి, అయ్యె=అయ్యెను.

తా. ఓనరసింహా! జీమూతవర్ణా! కరిరాజవరదా! శ్రీపతి నీముఖముతో సమానముకాలేక చంద్రుఁడు పెద్దనల్లనిమచ్చనుపొందెను. అందమైన నీనేత్రయుగముతో పోలలేక పద్మములు నీటిమధ్యప్రవేశించెను. నీకంఠముతో సరిరాలేక పెద్దశంఖము మహాధ్వనిచేయఁదొడగెను. నీసుందరమగు

స్వరూపముతో సరికాఁజాలక మన్మథుఁడు నీకునూఱుఁడయ్యెను. లక్ష్మీదేవి నిన్ను ప్రేమించివిడువలేక శాశ్వతముగ నీకుపట్టపుదేవియయ్యెను.

సీ. హరిదాసులను నింద ♦ లాడకుండిన ఁజాలుఁ
సకల గ్రంథమ్ములు ♦ చదివినట్లు
భిక్ష యియ్యంగఁ ద ♦ ప్పింప కుండినఁ జాలు
జేముట్టి దానంబు ♦ చేసినట్లు
మించి సజ్జనుల వం ♦ చించ కుండినఁ జాలు
నింపుగా బహుమాన ♦ మిచ్చినట్లు
దేవాగ్రహారముల్ ♦ దీయకుండినఁ జాలుఁ
గనకకంబపుగుళ్ళు ♦ గట్టినట్లు
తే. ఒకని వర్షాశనము ముంచ ♦ కున్న ఁజాలుఁ
బేరుకీర్తిగ సత్రముల్ ♦ పెట్టినట్లు ॥భూ॥ 79

టీ. భూ...దూర, హరిదాసులను=విష్ణుభక్తులను, నిందలాడకుండినన్=నిందింపకుండిన, చాలున్=చాలును, సకలగ్రంథమ్ములు=అన్నిపుస్తకములును, చదివినట్లు, భిక్షయియ్యంగన్=ధర్మముచేయుచుండగా, తప్పింపకుండినన్=పడగొట్టకుండిన, చాలున్=సరిపోవును, చేముట్టి=చేతబట్టి, దానంబుచేసినట్లు=ధర్మముచేసినట్లు, మించి=మితిమీరి, సజ్జనుల=మంచివారలను, వంచింపకుండినన్ చాలు=మోసపుచ్చకున్న సరిపోవును, ఇంపుగా=అందముగా బహుమానము=కానుక, ఇచ్చినట్లు, దేవాగ్రహారముల్=దేవాలయములకుఁ దత్తు, భూపసతులు, దీయకుండినన్ చాలున్=ఊడదీయకుండినసరిపోవును, కనకకంబపుగుళ్ళు=బంగారుస్తంభములుగల దేవాలయములు, కట్టినట్లు=కట్టినదానితో సమానము, ఒకని, వర్షాశనము=సంవత్సరముమామూలు, ముంచకున్నన్=పాడుచేయకుండిన, చాలున్=చాలును, పేరుకీర్తిగ=గొప్పకీర్తి గలుగునట్లు, సత్రముల్=సత్రములు, పెట్టినట్లు=పెట్టినవిధము.

తా. ఓనరసింహా! హరిదాసులను నిందింపకున్న సమస్తగ్రంథములు చదివినట్లే. ఇచ్చేదానములు తప్పింపకుండిన తాను దానముచేసినట్లే. గర్వించి సజ్జనులను మోసముచేయకుండిన యొప్పిదముగాకానుకలిచ్చినట్లే. దేవాలయములకిచ్చిన యగ్రహారములు తీయకుండిన బంగారుస్తంభములుగల దేవాలయములుకట్టినట్లే. ఇతరుల వార్షికములను పాడుచేయకుండిన తనపేరు మోగునట్లు సత్రములు పెట్టినట్లగును.

సీ. ఇహలోక సౌఖ్యము ♦ లిచ్ఛగించెదమన్న
  దేహ మెప్పటికిఁ దా ♦ స్థిరత నొందద
దాయుష్యమున్న ప ♦ ర్యంతంబు పటుతయు
  నొక్కతీరున నుండ ♦ దుర్విలోన
బాల్య యువత్వ దు ♦ ర్బల వార్ధకములను
  మూఁటిలో మునిఁగెడి ♦ మురికికొంప
భ్రాంతితో దీని గా ♦ పాడుదమను కొన్న
  గాలమృత్యువుచేతఁ ♦ గోలుపోవు
తే. నమ్మరాదయ్యయిది మాయ ♦ నాటకంబు
  జన్మమిఁక నొల్ల నన్నేలు ♦ జలజనాభ ॥భూ॥ 80

టీ. భూష...దూర, జలజనాభ=పద్మము నాభియందుకలవాఁడా! ఇహలోకసౌఖ్యములు=ఈభూలోకసుఖములు, ఇచ్ఛగించెదమన్న=ఇష్టపడెదమనుకొనిన, దేహము=శరీరము, ఎప్పటికిన్=ఎన్నటికిని, తాన్=తాను, స్థిరతనొందదు=శాశ్వతముబొందదు, ఉర్విలోనన్=భూమియందు ఆయుష్యమున్న పర్యంతము=బ్రతికియున్నంతకాలము,పటుత్వమున్=దార్ఢ్యము,ఒక్కతీరుననుండదు=ఒకేవిధముగానుండదు, బాల్య=బాల్యము, యువత్వ=యౌవనము, దుర్బల=బలహీనమైన, వార్ధకములు=ముసలితనములు, అను=అనఁబడు, మూఁటిలో=మూడుఅవస్థలయందును, మునిఁగెడి=మునుఁగునట్టి,మురికికొంప=

కుళ్ళుగలయిల్లు, భ్రాంతితో=మోహముతో, దీనిఁ=ఈశరీరమును, కాపాడుదము, అనుకొన్నఁ=తలఁచినను, కాలమృత్యువు చేతఁ=కాలమువచ్చినపుడు గల్గు చావువలన, గోలుపోవు=నశించును, నమ్మరాదయ్యా=నమ్మకూడదు, ఇది=ఈశరీరము, మాయనాటకంబు=బూటకపునాటకమువంటిది, ఇఁకన్=ఇఁకమీఁదట, జన్మము=తిరిగిపుట్టుట, ఒల్లన్=కోరను, నన్ను, ఏలు=కాపాడుము.

తా. ఓనరసింహా! జలజనాభా! ఈలోకసుఖములుకోరి యనుభవింతమనిన నీదేహము శాశ్వతముగాదు. బ్రతికియున్నంతకాలమైనను దారుఢ్యమొక్కరీతిగానుండదు. బాల్యము, యౌవనము, బలహీనమయిన ముసలితనము అనుమూడవస్థలయందును మునుఁగునట్టి పాడుకొంప, ఈదేహము నాశతో కాపాడుదమన్న కాలమృత్యువుచే హరింపబడును. ఇట్టిమాయనాటకమును నమ్మరాదు. ఇఁకమీదట తిరిగి పుట్టుట కోరను. నన్నురక్షింపుము. నాకుజన్మలేకుండజేయుము.

సీ. వదనంబు నీనామ ♦ భజన గోరుచునుండు
జిహ్వనీకీర్తనల్ ♦ జేయగోరు
హస్తయుగ్మంబు ని ♦ న్నర్చింపఁగోరును
కర్ణముల్ నీమీఁది ♦ కథలు గోరు
తనువు నీసేవయే ♦ ఘనముగాఁ గోరును
నయనముల్ నీదర్శ ♦ నంబుగోరు
మూర్ధ నీపాదముల్ ♦ మ్రొక్కఁగాఁ గోరును
ఆత్మ నీదై యుండు ♦ నరసిమూఁడ
తే. స్వప్నముననైన నేవేళ ♦ సంతతమును
బుద్ధి నీపాదములయందుఁ ♦ బూనియుండు ॥భూ॥ 81

టీ. భూష...దూర, వదనంబు=ముఖము, నీనామభజనన్=నీ పేరును స్మరించుట, కోరుచునుండు=వాంఛించుచుండును, జిహ్వ=నాలుక, నీకీర్తనల్=నిన్నుఁగీర్తించుట, చేయగోరు, హస్తయుగ్మంబు=రెండు చేతులును, నిన్ను, అర్చింపన్=పూజించుటకు, కోరును, కర్ణముల్=చెవులు, నీవిూది కథలు=నిన్ను గుఱించినకథలు, కోరు, తనువు=శరీరము, నీసేవయే=నీకొలువునే, ఘనముగాన్=గొప్పగా, కోరును, నయనముల్=కండ్లు, నీదర్శనంబు గోరు=నీరూపమును గాంచుటకుకోరును, మూర్ధ=శిరస్సు, నీపాదముల్=నీ కాళ్ళను, మ్రొక్కఁగాన్=నమస్కరించుటకు, కోరును, అరసిచూడ=పరికించిచూడగా, ఆత్మ=మనస్సు, నీదైయుండు=నీదిగానేయుండును, స్వప్నముననైనన్=కలలోనైనన్, ఏవేళ, సంతతమును=ఎల్లప్పుడును, బుద్ధి=మనస్సు, నీపాదములయందున్, పూనియుండు=లగ్నమైయుండును,

తా. ఓనరసింహా! నామోము నీనామస్మరణము సేయఁగోరును. నాలుక నీకీర్తనలు పాడగోరును. రెండు చేతులును నిన్ను పూజింపగోరును. చెవులు నీకథలువినగోరును. శరీరము నీసేవ జేయగోరును. కన్నులు నీదర్శనము గోరును. సిరస్సు నీపాదములకు నమస్కరింపఁగోరును. విచారించిచూడగా నాయాత్మ నీదై యుండును. కలలోనైనను ఏసమయమందైనను ఎల్లప్పుడును నామనస్సు నీపాదములయందే యుండును.

సీ. పద్మాక్షు మమతచేఁ ♦ బరము నందెద మంచు
విఱ్ఱవీఁగెదమయ్య ♦ వెఱ్ఱిపట్టి
మాస్వతంత్రంబైన ♦ మదము గండ్లకుఁ గప్పి
మొగము పట్టదు కాము ♦ మోహమునను
బ్రహ్మదేవుండైనఁ ♦ బైఁడిదేహము గల్గ
జేసి వేయక మమ్ముఁ ♦ జెఱిచె నతఁడు
తుచ్ఛమైనటువంటి ♦ తోలెమ్మకలతోడి
ముఱికిచెత్తలు చేర్చి ♦ మూట కట్టె

తే. నీశరీరాలు పడిపోవు ♦ టెఱుఁగ కేము
కాముకుల మైతి మింక మిమ్ము ♦ గానలేము ॥భూ॥ 82

టీ. భూష...దూర, పద్మాక్ష=తామరలవంటికన్నులుగలవాఁడా! మమతచేన్=మోహముచేత, పరమున్=మోక్షమును అందెదమంచు=పొందెదమనుకొని, వెఱ్ఱిపట్టి=పిచ్చివారమై, విఱ్ఱవీఁగెదమయ్యా=గర్వించెదము, మాస్వతంత్రంబైన=మాస్వాధీనమయిన, మదము=గర్వము, కండ్లకుఁగప్పి=కండ్లనుమూసి, కామ=ఆశకును, మోహమునను=అజ్ఞానమునకును, మొగము పట్టను=ముఖముచాలకుండును, బ్రహ్మదేవుండైనన్=సృష్టికర్తయగు బ్రహ్మదేవుఁడైనను, పైఁడిదేహముఁగల్గన్=బంగారపుశరీరముగల్గునట్లు, చేసివేయక మమ్మున్, చెఱిచె=పాడుచేసెను, అతఁడు=ఆబ్రహ్మదేవుఁడు, తుచ్ఛమైనటువంటి=నీచమయినటువంటి, తోలెమ్ముకలతోడి=తోలుయెముకలతోఁ గూడిన, ముఱికిచెత్తలు=కుళ్ళుపెంటలు, చేర్చి=కూర్చి, మూటకట్టెన్=దేహముగా నమర్చెను, ఈశరీరాలు=ఈదేహములు, పడిపోవుట=నశించుట, ఎఱుగక=తెలుసుకొనక, ఏము=మేము, కాముకులమైతిమి=దురాశాపరులమైతిమి, ఇఁక, మిమ్మున్=మిమ్ములను, కానలేము=కనుగొనలేము.

తా. ఓనరసింహా! పద్మాక్షా! పిచ్చివారమై గర్వముగల్గి భ్రాంతిచే మోక్షమును జేరగలమని విఱ్ఱవీగెదము. కాని మాస్వాధీనమయిన గర్వము కన్నులనుమూసికొనిపోయి ఆశయెక్కువై యజ్ఞానమధికమైయుండును. సృష్టికర్తయగు బ్రహ్మదేవుఁడైనను బంగారుశరీరము చేయక మమ్ముపాడు చేసెను. నీచాతినీచమయినతోలు, ఎముకలు, ముఱికి, చెత్తలుకూర్చి యీ దేహములు నిర్మించెను. ఇవి నశించునని తెలుసుకొనక మేము మోహవశులమైతిమి. నిన్నుకనుగొనలేము.

సీ. గరుడవాహన దివ్య ♦ కౌస్తుభాలంకార
రవికోటితేజ సా ♦ రంగవదన
మణిగణాన్వితహేమ ♦ మకుటాభరణ చారు
మకరకుండల లస ♦ న్మందహాస

కాంచనాంబర రత్న ♦ కాంచీవిభూషిత
సురవరార్చిత చంద్ర ♦ సూర్యనయన
కమలనాభ ముకుంద ♦ గంగాధరస్తుత
రాక్షసాంతక నాగ ♦ రాజశయన

తే. పతితపావన లక్ష్మీశ ♦ బ్రహ్మజనక
భక్తవత్సల సర్వేశ ♦ పరమపురుష ॥భూ॥ 83

టీ. భూష...దూగ, గరుడవాహన = గరుడుపక్షి నెక్కువాఁడా! దివ్య=మహిమగల, కౌస్తుభాలంకార=కౌస్తుభమను పేరుగల మణిచే అలంకరింపబడినవాఁడా! రవికోటితేజ=కోటిసూర్యులకాంతిగలవాఁడా! సారంగ=చిత్రవర్ణముగల, వదన=ముఖముగలవాఁడా! మణి=రత్నములయొక్క గణాన్విత=సమూహముతోకూడుకొన్న, హేమ=బంగారపు, మకుట=కిరీటమును, ఆభరణ=నగ గాధరించినవాఁడా! చారు=మనోహరమైన, మకరకుండల = మకరాకారముగాగలకర్ణాభరణములుగలవాఁడా! లసన్మందహాస= లసత్ =ప్రకాశమానమైన, మందహాస=చిఱునవ్వుగలవాఁడా! కాంచనాంబర=బంగారువస్త్రమునుధరించువాఁడా! రత్న=రత్నస్థాపితమైన, కాంచీ= మొలత్రాటిచేత, విభూషిత=అలంకరింపబడినవాఁడా! సురవరార్చిత=దేవతాశ్రేష్ఠులచేఁబూజింపబడినవాఁడా! చంద్రసూర్యనయన=సూర్యుఁడును, చంద్రుఁడును నేత్రములుగాగలవాఁడా! కమలనాభ=పద్మము నాభియందుఁ గలవాఁడా! ముకుంద=ఒప్పిదమైనవాఁడా! గంగాధరస్తుత=గంగాదేవిని ధరించిన శివునిపొగడబడినవాఁడా! రాక్షసాంతక=దానవులను సంహరించువాఁడా! నాగరాజశయన=పాములకురాజయిన ఆదిశేషునిపైపరుండువాఁడా! పతిత=పాపులను, పావన=పవిత్రులుగాఁజేయువాఁడా! లక్ష్మీశ= లక్ష్మీప్రియా! బ్రహ్మజనక=సృష్టికర్తకు తండ్రివైనవాఁడా! భక్తవత్సల= సేవకులపైప్రేమగలవాఁడా! సర్వేశ=సమస్తమునకు ప్రభువైనవాఁడా! పరమపురుష=పురుషులలోమహాత్తైయినవాఁడా!

తా. ఓనరసింహా ! గరుడవాహన, కౌస్తుభాలంకారా ! రవికోటితేజ! విచిత్రకర్ణవదనా ! మణికిరీటధారీ ! మకరకుండలధరప్రకాశమగు చెక్కులవు గలవాఁడా ! కాంచనచేలా ! రత్నస్థాపిత మొలత్రాడుచే ప్రకాశించువాఁడా ! సురవరార్చిత సూర్యచంద్రనయన పద్మనాభ ! ముకుంద ! శివనుతా ! రాక్షసాంతకా ! శేషశయనా ! పతితపావన ! లక్ష్మీశ ! బ్రహ్మజనక ! భక్తవత్సల ! సర్వేశా ! పరమపురుషా ! రక్షింపుము.

సీ. పలుమాఱు దశరూపఁ ♦ ములు ధరించితి వేల
నేకరూపముఁ బొంద ♦ వేల నీవు
నయమున క్షీరాబ్ధి ♦ నడుమఁ జేరితివేల
రత్నకాంచన మంది ♦ రములు లేవె
పన్నగేంద్రునిమీఁదఁ ♦ బవ్వళించితివేల
జలతారు పట్టెమం ♦ చములు లేవె
ఱెక్కలు గలపక్షి ♦ నెక్కి సాగితివేల
గజతురంగాందోళి ♦ కములు లేవె

తే. వనజలోచన యిటువంటి ♦ వైభవములు
సొగసుగా నీకుఁ దోఁచెనో ♦ సుందరాంగ ॥భూ॥ 84

టీ. భూష...దూర, వనజలోచన=పద్మములవంటి నేత్రములుకల వాఁడా ! సుందరాంగ=అందమైన శరీరము కలవాఁడా ! పలుమారు=అనేక మారులు, దశరూపములు=పదియవతారములు, ధరించితివి, ఏల? ఏకరూపముఁ=ఒకేరూపమును, నీవు, పొందవేల=ఎందులకు పొందవు, నయమున=ఒప్పిదముగా, క్షీరాబ్ధినడుమఁ=పాలసముద్రముమధ్య, చేరితివేల=ఎందుకు ప్రవేశించితివి, రత్నకాంచనమందిరములు=రత్నములతోను బంగారముతోను కట్టినయిండ్లులేవా? పన్నగేంద్రునిమీఁద=ఆదిశేషునిపైని, ఏల, పవ్వళించితివి=పరుందువు? జలతారు పట్టెమంచములు=జలతారుతోనిండిన మంచ

ములు, లేవే? ఱెక్కలుగలపక్షిని=గరుడునిపై, ఎక్కసాగితివేల=ఎందుల కెక్కెదవు? గజ=ఏనుగులు, తురంగ=గుఱ్ఱములు, ఆందోళికములు=పల్లకులు, లేవె? ఇటువంటి వైభవములు=ఈలాటి భాగ్యములు, నీకు సొగసుగా=అందముగా, తోచెనో=కనుపించినవా?

తా. ఓనరసింహస్వామీ! నీచంబులైన చేప, తాబేలు, అడవిపంది మొదలగు ననేకరూపములను ధరించితివేల? ఒక్కరూపముగ నుండజాలవా? నీకు బంగారముపై రత్నములుచెక్కికట్టిన యిండ్లులేక పాలసముద్రమువద్ద నుందువా? ఏనుగులు గుఱ్ఱములు రథములు మొదలగునవిలేక పక్షిపైనెక్కితిరుగుదువా? పండుకొనుటకు జలతారు పట్టెమంచములులేక పాముపైపరుందువా? లేక నీపైవన్నియు నీకు అందములైనవని భాగ్యముకలవని తోచినవా?

సీ. తిరుపతిస్థలమందుఁ ♦ దిన్నగా నేనున్న
వేంకటేశుఁడు మేఁత ♦ వేయలేఁడొ
పురుషోత్తమమునకు ♦ బోయినఁజాలు జ
గన్నాథుఁడన్నంబుఁ ♦ గడపలేఁడొ
శ్రీరంగమునకు నే ♦ జేరఁబోయినఁజాలు
స్వామి గ్రాసముఁ బెట్టి ♦ సాకలేఁడొ
కాంచీపురములోనఁ ♦ గదిసి నే గొలువున్న
గరివరదుఁడు పొట్ట ♦ గడపలేఁడొ

తే. యెందుఁ బోవక నేను నీ ♦ మందిరమున
నిలిచితిని నీకు నామీఁద ♦ నెనరులేదు ॥భూ॥ 85

టీ. భూష...దూర, తిరుపతిస్థలమందుఁ=తిరుపతికొండమీఁద, తిన్నగా=సరిగా, నేన్=నేను, ఉన్న=ఉన్నచో, వేంకటేశుఁడు=వేంకటేశ్వరస్వామి, మేఁతవేయలేఁడో=భోజనము పెట్టలేఁడా! పురుషోత్తమమునకు న్=

జగన్నాథపట్టణమునకు, పోయిననాలు=వెళ్ళినమాత్రముననే, జగన్నాథుడు=జగన్నాథస్వామి, అన్నంబున్, గడపలేడో=జరుపలేడా! శ్రీరంగమునకు, నేజేరపోయినన్, చాలు, స్వామి=శ్రీరంగనాథస్వామి, గ్రాసమున్=భోజనమును, పెట్టి, సాకలేడో=పోషింపలేడా! కాంచీపురములోనన్=కాంచీపట్టణమునందు, కదిసి=చేరి, నే=నేను, కొలువున్న=సేవించినచో, కరిపరదుఁడు = గజేంద్రునిరక్షించినవాఁడు, జరపలేడో=పోషింపలేడా! ఎందున్=ఎచ్చటికి, పోవక=వెళ్ళక, నేను, నీమందిరమున=నీగృహమునందు, నిలిచితిని=నిలిచియున్నాను, నీకు, నామీఁద నెనరులేదు=ప్రేమలేదు.

తా. ఓనరసింహా! నేను తిరుపతికొండపైనుండే వెంకటేశ్వరస్వామి నాకింతతిండిపెట్టకపోడు. జగన్నాథమునకుపోయిన నాజగన్నాథస్వామి నాకు సరిపడినతిండి నిడకపోడు. శ్రీరంగమునకుబోయిన రంగనాథస్వామి నన్నుపెంచకవిడువడు. కంచికినేనుపోయితినేని వరదరాజస్వామి నన్నాదరింపకపోడు. ఎక్కడికినిపోక నిన్నేనమ్మి నీయిల్లువిడువలేకుంటిని. నామీద నీకు కొంచెమైనదయలేదు.

సీ. తార్క్ష్యవాహన నీవు ♦ దండిదాతవటంచు
గోరి వేడుకనిన్నుఁ ♦ గొల్వవచ్చి
యర్థిమార్గమును నే ♦ ననుసరించితినయ్యె
లానైనఁ బదునాల్గు ♦ లక్షలైన
వేషముల్ వేసి నా ♦ విద్యాప్రగల్భత
జూపసాగితి నీకు ♦ సుందరాంగ
యానందమైన నే ♦ నడుగవచ్చిన దిచ్చి
వాంఛదీర్పుము నీల ♦ వర్ణ వేగ
తే. నీకు నావిద్య హర్షంబు ♦ గాకయున్న
తేపతేపకు వేషముల్ ♦ దేనుజూమ్మి ॥భూ॥

టీ. భూప...దూర, తార్క్ష్యవాహన=గరుడవాహనా! నీవు, దండి దాతవటంచున్=గొప్పధర్మపరుఁడవని, కోరి=ఇష్టపడి, వేడుక=సంతోషముతో, నిన్నుఁగొల్వవచ్చి=నిన్నుపూజింపవచ్చి, అర్థిమార్గమును=బిచ్చగాని స్వభావమును, నేను, అనుసరించితినయ్యా=అవలంభించితిని, లావైనన్=గొప్పవయిన, పదునాల్గులక్షలైన=పదునాలుగులక్షలయినప్పటికిన్ని, సుందరాంగ=సొగసైనఅందముగలవాఁడా! వేషముల్ వేసి = వేషములుధరించి, నావిద్యాప్రగల్భత్=నావిద్యయందలినేర్పును, నీకు చూపసాగితి=చూపించ మొదలుపెట్టితిని, నీలవర్ణ = నల్లనిశరీరచ్ఛాయగలవాఁడా! ఆనందమైనన్=నీకుసంతసమయ్యెనేని, ఏన్=నేను,అడుగవచ్చినది=కోరవచ్చినదానిని, ఇచ్చి, వేగ=వెంటనే, వాంఛదీర్పుము=కోర్కెనెఱవేర్పుము, నీకు, నావిద్య హర్షంబు గాకయున్న=సంతోషము గాకపోయినచో, తేప తేపకు=మాటిమాటికి వేషముల్=నేవేసేవేషములు, తేనుజుమ్మీ=తీసుకొనిరానుసుమా?

తా. ఓనరసింహా! గరుడవాహనా! నీవుగొప్పదాతవనికోరి సంతోషముతో నిన్ను సేవింపవచ్చి బిచ్చకునివలె నేనవలంభించి గొప్పనైన పదునాల్గులక్షలైనను వేషములువేసి నావిద్యానేర్పుజూప మొదలుపెట్టితిని. ఓసుందరాంగా! నీకు సంతోషమైనచో నేనడిగేదానినిచ్చి వెంటనే నా కోర్కెఁదీర్పుము. నీలవర్ణా! నీకు నావిద్యసంతోషముగాలేనిచో మాటిమాటికి యిట్టివేషములు తీసుకొనిరానుసుమా!

సీ. అమరేంద్రవినుత నే ♦ నతిదురాత్ముఁడ సంచు
గలలోననైనను ♦ గనులఁబడవు
నీవు ప్రత్యక్షమై ♦ నిలువకుండిన మానె
దొడ్డగా నొకయుక్తి ♦ దోరకెనయ్య
గిట్టికోయ్యను దెచ్చి ♦ ఘనముగా ఖండించి
నీస్వరూపము చేసి ♦ నిలుపుకొంచు
ధూపదీపము లిచ్చి ♦ తులసితోఁ బూజించి
నిత్యనైవేద్యముల్ ♦ నేమముగను

తే. నడుపుచును నిన్నుఁ గొలిచెద ♦ నమ్మిబుద్ధి
నీ ప్రపంచంబు గలిగె నా ♦ కింతె చాలు ‖ భూ‖ 87

టీ. భూష ... దూర, అమరేంద్రవినుత=దేవతలకు ప్రభువైనఇంద్రునిచే పొగడబడినవాఁడా! నేను, అతిదురాత్ముఁడను=మిక్కిలిచెడ్డబుద్ధిగలవాఁడను, అంచుఁన్=అనుచు, కలలోనసైనను=కలయందైనను, కనులబడవు=కానుపింపవు? నీవు, ప్రత్యక్షమై=ఎదురుగా కనబడి, నిలుపకుండిన=నిలువకున్నను, మానె=పోనిమ్ము, దొడ్డగాఁన్=గొప్పగా, ఒకయుక్తి=ఒకయుపాయము, దొరకెనయ్యా=లభించినది, గట్టికొయ్యనుదెచ్చి = గట్టికఱ్ఱముక్కను తెచ్చి, ఘనముగాఖండించి=నేర్పుతోనరికి, నీస్వరూపము చేసి=నీయాకారమునిర్మించి, నిలుపుకొంచు = నిలువబెట్టుకొంచును, ధూపదీపములిచ్చి=సువాసనగల పొగలుహారతులునిచ్చి, తులసితోఁబూజించి=తులసిదళముతోపూజచేసి, నేమముగను=నియతిదప్పక, నిత్యనైవేద్యముల్=ప్రతిదినమునందు నారగింపులు, నడుపుచును=జరుపుచును, బుద్ధినమ్మి=మనస్సునమ్మి, నిన్నుఁన్, కొలిచెద=సేవించెదను, నాకు, ఈప్రపంచంబు=ఈలోకము, కలిగెన్=లభించెను, ఇంతె=ఈమాత్రమే, చాలు=చాలును.

తా. ఓనరసింహా! నిన్నింద్రాదులుకూడ పొగడుదురు. నేనేమిక్కిలిచెడ్డవాఁడనని కలలోనైన నాకు గనపడవు. నీవుప్రత్యక్షమై కనబడకుండినను పోనిమ్ము; నాకొక గొప్పయుక్తి లభించినది; ఒకకొయ్యను నీస్వరూపముగానిర్మించి ధూపదీపములిచ్చి తులసిదళముతో బూజించి నిత్యనైవేద్యములు జరుపుచు నామనస్సున యావిగ్రహమునే నిన్నుగానమ్మి సేవించుకొందును. నాకు ఈలోకమున ఇంతేలభించినది. ఈమాత్రమేచాలును.

సీ. భువనేశ గోవింద ♦ రవికోటి సంకాశ
పక్షివాహన భక్త ♦ పారిజాత
యంభోజభవరుద్ర ♦ జంభారిసన్నుత
సామగానవిలోల ♦ సారసాక్ష

వనధిగంభీర శ్రీ ♦ వత్సకౌస్తుభవక్ష
 శంఖచక్రగదాసి ♦ శార్ఙ్గహస్త
దీనరక్షక వాసు ♦ దేవ దైత్యవినాశ
 నారదార్చిత దివ్య ♦ నాగశయన
తే. చారు నవరత్నకుండల ♦ శ్రవణయుగళ
 విబుధవందిత పాదాబ్జ ♦ విశ్వరూప ॥భూ॥ 88

టీ. భూష...దూర, భువనేశ=లోకపాలకా! గోవింద, రవికోటిసంకాశ = కోటిసూర్యులతో సమానమైనవాఁడా! పక్షివాహన, భక్తపారిజాత=భక్తులకు కల్పవృక్షమువంటివాఁడా! అంభోజభవ = కమలమునందు పుట్టినబ్రహ్మచేతను, రుద్ర=శివుని చేతను, జంభారి=దేవేంద్రుని చేతను, సన్నుత=కొనియాడఁబడువాఁడా! సామగానవిలోల = సామవేదమునందలి గానమును వినుటయందు దాసక్తిగలవాఁడా! సారస + అక్ష=సారసాక్ష=పద్మమువంటి నేత్రములుగలవాఁడా! వనిధిగంభీర =సముద్రునివంటి గాంభీర్యముగలవాఁడా! శ్రీవత్స=శ్రీవత్సమను పుట్టుమచ్చగలవాఁడా! కౌస్తుభవక్ష=కౌస్తుభమను మణినివక్షస్థలమునందు ధరించినవాఁడా! శంఖ = శంఖము, చక్ర=చక్రము, గద=గదయు, అసి=ఖడ్గము, శార్ఙ్గ=శార్ఙ్గమనువిల్లు, హస్త=చేతులయందు ధరించినవాఁడా! దీనరక్షక=దిక్కులేనివారలను గాపాడువాఁడా! వాసుదేవ=వసుదేవునికుమారుఁడా! దైత్యవినాశ=రాక్షసులను నాశము చేయువాఁడా! నారద + అర్చిత=నారదార్చిత=నారదుని చే పూజింపబడువాఁడా! దివ్యనాగశయన = శ్రేష్ఠమైనపాముపై బరుండువాఁడా! చారు=మనోజ్ఞములగు, నవరత్నకుండల=తొమ్మిదిరత్నములచే చెక్కఁబడిన కుండలములను, శ్రవణయుగళ=రెండు చెవులయందును ధరించినవాఁడా! విబుధవందిత=దేవతలచే బొగడబడిన, పాదాబ్జ=పద్మములవంటిపాదములుగలవాఁడా! విశ్వరూప=ప్రపంచమే నీరూపముగాఁగలవాఁడా!

తా. ఓ నరసింహా! లోకపాలకా! గోవిందా! కోటిసూర్యప్రభా! పక్షివాహన! భక్తపారిజాత! బ్రహ్మరుద్రఇంద్రాదులచే పొగడబడినవాడా! సామగానవిలోలా! పద్మాక్షా! వనధిగంభీరా! శ్రీవత్సకౌస్తుభవక్షా! శంఖ చక్రగదాసి శార్ఙ్గపాణీ! దీనరక్షకా! వాసుదేవా! దానవసంహారా! నారదార్చితా! శేషశయనా! నవరత్నకుండలశ్రవణయుగళా! విబుధవందిత పాదాబ్జా! విశ్వరూపా!

సీ. నాగేంద్రశయన నీ ♦ నామ మాధుర్యంబు
మూఁడుకన్నుల సాంబ ♦ మూర్తి కెఱుక
పంకజాతాక్ష నీ ♦ బలపరాక్రమ మెల్ల
భారతీపతి యైన ♦ బ్రహ్మ కెఱుక
మధుకైటభారి నీ ♦ మాయా సమర్థత
వసుధలో బలిచక్ర ♦ వర్తి కెఱుక
పరమాత్మ నీదగు ♦ పక్షపాతిత్వంబు
దశశతాక్షుల పురం ♦ దరుని కెఱుక

తే. వీరి కెఱుకగునీకథల్ ♦ వింతలెల్ల
నరుల కెఱుకన్న నెవ్వరైన ♦ నవ్విపోరె ॥భూ॥ 89

టీ. భూష...దూర, నాగేంద్రశయన = పాముపైపరుండువాఁడా! నీనామమాధుర్యంబు = నీ నామమునందలి తియ్యదనము, మూఁడుకన్నులు = మూఁడుకన్నులుగల్గిన, సాంబమూర్తికి = శివునకు, ఎఱుక = తెలియును, పంకజాతాక్ష = బురదయందుపుట్టిన తామరలవంటి నేత్రములుగలవాఁడా! నీబలపరాక్రమ మెల్ల = నీబలశౌర్యములంతయు, భారతీపతియైన = సరస్వతీదేవికిభర్తయైనటువంటి, బ్రహ్మకెఱుక = బ్రహ్మకే తెలియును, మధుకైటభారి = మధువు, కైటభుఁడు, అనురాక్షసులకు పగవాఁడా! నీమాయాసమర్థత = నీమాయయొక్క నేర్పు, వసుధలో = భూమియందు, బలిచక్రవర్తి కెఱుక, పరమాత్మ =

దివ్యమైనఆత్మగలవాఁడా ! నీదగు=నీదయిన, పక్షపాతిత్వంబు=వలపక్షపు బుద్ధి, దశశతాక్షుల=పదినూఱులకన్నులుగల, పురందరుని కెఱుక=ఇంద్రునకు తెలియును, వీరికి=ఇటువంటి దేవతులకు, ఎఱుకగు=తెలియునట్టి, నీకథల్= నీచరిత్రలయందు, వింతలెల్ల=మహిమలన్నియు, నరులకు=మానవులకు, ఎఱుకన్న=తెలియునన్నచో, ఎవరు + ఐనన్=ఎవ్వరైనను, నవ్విపోరె=నవ్వరా !

తా. ఓనరసింహా ! నాగేంద్రశయనా ! నీనామమాధుర్యము త్రినేత్రుడయిన శివునకు తెలియును. పంకజాతాక్షా ! నీబలపరాక్రమములు భారతీపతియైన బ్రహ్మకు తెలియును. మధుకైటభారీ ! నీమాయావిలాసము బలిచక్రవర్తికి తెలియును. పరమాత్మా ! నీవలపక్షబుద్ధి వేయికన్నులుగల దేవేంద్రునకు తెలియును. ఇట్టిమహానుభావుల కెఱుకగు నీచరిత్రములు మహిమలు యల్పులైన మానవులకు తెలియునన్న వినినవారలు నవ్వరా?

సీ. అంద ఱేమైన ని ♦ న్నడుగవచ్చెద రంచు
 క్షీరసాగరమందుఁ ♦ జేరినావు
నీచుట్టు సేవకుల్ ♦ నిలువకుండుటకునై
 భయద సర్పముమీఁద ♦ బండినావు
భక్తబృందము వెంటఁ ♦ బడి చరించెద రంచు
 నెగసి పోయెడి పక్షి ♦ నెక్కినావు
దాసులు నీ ద్వార ♦ మాసింప కుంటకు
 మంచియోధుల కావ ♦ లుంచినావు
తే. లావుగలవాఁడ వైతివే ♦ లాగు నేను
 నిన్నుఁ జూతును నాతండ్రి ♦ నీరజాక్ష ॥ భూ॥ 90

టీ. భూష...దూర, నీరజాక్ష=పద్మములవంటికన్నులుకలవాఁడా ! అందఱు, నిన్ను, నాతండ్రీ, ఏమైన, అడుగవచ్చెదరంచు=అడుగుటకు వత్తురని, క్షీరసాగరమందుఁ=పాలసముద్రమునందు, చేరినావు=ప్రవేశించినావు, నీచుట్టు, సేవకుల్, నిలువకుండుటకునై=చేరకుండునట్లు, భయద=భయంకర

మైన, సర్పముమీఁదన్=పాముమీఁద, పండినావు=పవళించితివి, భక్తబృందము=భక్తసమూహము, వెంటబడి=కూడకూడ, చరించెదరంచు=వత్తురనుకొని, ఎగసిపోయెడిపక్షిన్=ఎగిరిపోయెడిగరుత్మంతుని, ఎక్కినావు=ఎక్కితివి, దాసులు=భక్తులు, నీద్వారము=నీగుమ్మము, ఆశింపకుంటకు=ఆశపడకుండుటకు, మంచియోధుల=మంచిభటులను, కావలి=కాపుకాయుటకు, ఉంచినావు=పెట్టితివి, లావుగలవాఁడవు + ఐతివి = సామర్థ్యముగలవాఁడవైయున్నావు, నేను, ఏలాగు=ఏవిధముగా, నిన్నున్, చూతును=చూడగలను?

తా. ఓనరసింహా! అందఱుమైన గోరవత్తురని పాలసముద్రమునగాపురముంటివి. నీచుట్టును భక్తులు నిలతురని భయంకరమైనపాముమీఁద పవళించితివి. భక్తసమూహము నీకూడవత్తురని ఆకసమునదిరుగు గరుత్మంతునిపైనెక్కితివి. దాసులు నీద్వారమునాశ్రయింపకుండుటకై యట మంచిభటులను కాపలాయుంచితివి. ఇట్టిసామర్థ్యముగలవాఁడవై యున్నావు. ఏవిధముగా నిన్ను నేను చూడగలను?

సీ. నీకథల్ చెవులలో ♦ సోఁకుట మొదలుగాఁ
బులకాంకురము మేనఁ ♦ బుట్టువాఁడు
నయమైన నీదివ్య ♦ నామకీర్తనలోన
మగ్నుఁడై దేహంబు ♦ మఱచువాఁడు
ఫాలంబుతో నీదు ♦ పాదయుగ్మమునకు
ప్రేమతో సంతస మ ♦ ర్పించువాఁడు
హరి పుండరీకాక్ష ♦ హరి రామ హరియంచు
వేడ్కతోఁ గేకలు ♦ వేయువాఁడు

తే. చిత్తకమలంబునను నిన్నుఁ ♦ జేర్చువాఁడు
నీదులోకమునం దుండు ♦ నీరజాక్ష ॥భూ॥ 91

టీ. భూష...దూర, నీరజాక్ష=పద్మములవంటికన్నులుగలవాఁడా! నీకథల్=నీచరిత్రములు, చెవులలో, సోఁకుట=పడుట, మొదలుగాన్=తడవుగా, పులకాంకురము=గగుర్పాటు, మేనన్=శరీరమందు, పుట్టువాఁడు=కలుగువాఁడును, నయమైన=మంచిదైన, నీదివ్య=నీయొక్క మహిమగల, కీర్తనలోన=కీర్తించుటయందు, మగ్నుఁడై=మునిగినవాఁడై, దేహంబు=శరీరమును, మఱచువాఁడు=మైమఱచువాఁడును, ఫాలంబుతో=శిరముతో, నీదుపాదయుగ్మమునకున్=నీరెండుపాదములకు, ప్రేమతో=భక్తిగా, దండము=నమస్కారము, అర్పించువాఁడు=చేయువాఁడును, హేపుండరీకాక్ష=ఓ తెల్లతామరవంటికన్నులుగలవాఁడా! హేరామ=ఓశ్రీరామచంద్రా! హరియంచు=ఓవిష్ణుమూర్తీ! యనుచు, వేడ్కతోన్=సంతోషముతో, కేకలువేయువాఁడు, చిత్తకమలంబునను=హృదయకమలమునందు, నిన్నున్, చేర్చువాఁడు=నిలుపువాఁడును, నీదు=నీయొక్క, లోకమునందు=వైకుంఠమందు, ఉండు=ఉండును.

తా. ఓనరసింహా! నీచరిత్రములు చెవులలో పడుటకు తడవుగా శరీరమునందు గగుర్పాటుకలుగువాఁడును, మంచిదైన నీమహిమను కీర్తించుటయందు మునిగి దేహమును మైమఱచువాఁడును శిరముతో నీపాదద్వయమును భక్తితో మ్రొక్కువాఁడును, హేపుండరీకాక్షా! హేరామా! హరీ యని సంతోషముతో కేకలువేయువాఁడును, చిత్తకమలమునందు నిన్ను నిల్పువాఁడును, నీలోకమైన వైకుంఠమునుపొంది శాశ్వతముగ నివసించును.

సీ. నిగమగోచర నేను ♦ నీకు మెప్పగునట్లు
లెస్సగాఁబూజింప ♦ లేనుజుమ్మి
నాకుఁ దోఁచిన భూష ♦ ణములు పెట్టెద నన్నఁ
గౌస్తుభమణి నీకుఁ ♦ గలదుమున్నె
భక్ష్యభోజ్యముల న ♦ ర్పణముఁ జేసెద నన్న
నీవు పెట్టితి సుధ ♦ నిర్జరులకుఁ

గలిమి కోలందిగ గాను ♦ కలనొసంగుద మన్న
భార్గవీదేవి నీ ♦ భార్యయయ్యె
తే. నన్ని గలవాఁడ వఖిల లో ♦ కాధిపతివి
నీకు సొమ్ములు పెట్ట నే ♦ నెంతవాఁడ ॥భూ॥ 92

టీ. భూష...దూర, నిగమగోచర=వేదములచేత తెలియబడువాఁడా! నేను, నీకు, మెప్పగునట్లు=వచ్చునట్లు, లెస్సగాన్=బాగుగా, పూజింపలేనుజుమ్మి, నాకున్, తోఁచిన=ఇష్టమైన, భూషణములు=నగలు, పెట్టెద నన్నన్=పెట్టసెంచిన, కౌస్తుభమణి, నీకున్, ముందె=ఇదివఱకె, కలదు, భక్ష్యభోజ్యములన్ = అనేకవిధములగు పిండివంటలను, అర్పణముచేసెద నన్న=సమర్పింతమనుకొనిన, నీవు, నిర్జరులకున్=దేవతలకు, సుధ=అమృతమును, పెట్టితివి=ఇచ్చియుంటివి, కలిమికోలంది=కలిగినదానిలో, కానుకలన్=బహుమతులను, ఒసంగెదనన్న=ఇచ్చెదననిన, భార్గవీదేవి=లక్ష్మీదేవి, నీభార్యయయ్యెన్=నీయొక్క భార్యఅయినది, అన్నిన్=సమస్తమును, కలవాఁడవు=కలిగినవాఁడవు, అఖిలలోక=సమస్తలోకములకు, అధిపతివి=ప్రభుఁడవు, నీకు, సొమ్ముల్ పెట్ట=నగలుపెట్టుటకు, ఏను=నేను, ఎంతవాఁడ=ఏపాటివాఁడను.

తా. ఓనరసింహా! నేను నీకు నచ్చునట్లు బాగుగా పూజింపలేను సుమా! నాకుతోఁచిన నగలను పెట్టెదనన్న కౌస్తుభమణి నీకు ముందేగలదు. అనేకవిధములగు పిండివంటలు సమర్పణజేసుకొందమనిన దేవతలకు నీవే అమృతము పెట్టినావు. నాకు కలిగినంతలో బహుమతులు నిచ్చెదననుకొనిన లక్ష్మిదేవి నీకు భార్యయయ్యెను. ఇట్లు అన్నియు గలిగినవాడవును అన్నిలోకములకు ప్రభువును అయిన నీకు సొమ్ములు పెట్టుటకు నేనెంతవాడను.

సీ. నవనవోజ్జపదాత్మ ♦ నన్ను బోషించెదవు
దాతవు నీ వంచు ♦ ధైర్యపడితి
నామనంబున నిన్ను ♦ నమ్మినందుకుఁ దండ్రి
మేలు నాకొనరింపు ♦ నీలదేహ

బళిబళీ నీయంత ♦ ప్రభువు నెక్కడఁ జూడఁ
బుడమిలో నీపేరు ♦ పొగడవచ్చు
ముందుఁ జేసిన పాప ♦ మును నశింపఁగ జేసి
నిర్వహింపుము నన్ను ♦ నేర్పుతోడ
తే. బరమ సంతోష మాయె నా ♦ ప్రాణములకు
నీఋణము దీర్చుకొన నేర ♦ నీరజాక్ష ॥భూ॥ 93

టీ. భూష...దూర, నవసరోజ=క్రొత్త తామరయొక్క, దళ=రేకుల వంటి, అక్ష=నేత్రములుగలవాఁడా! నన్నుఁ, పోషించెడు=పెంచెడు, దాతవు=దానశీలుఁడవు, నీవు, అంచు=అనుకొని, ధైర్యపడితి=ధైర్యముతో నుంటిని, నామనంబున, నిన్ను, నమ్మినందుకుఁ=నమ్ముకొనియున్నందులకు, నీలదేహ=నల్లనిశరీరముగలవాఁడా! నాకు, మేలు=మంచి, ఒనరింపుము=చేయుము, భళిభళీ=ఆహాహా! నీయంతప్రభువున్=నీయంతటిపాలకుని, ఎక్కడఁ=ఎచ్చటను, చూడఁ=చూడలేదు, పుడమిలో=భూమిలో, నీ పేరు, పొగడవచ్చు=కొనియాడవచ్చును, ముందుఁజేసిన=పూర్వముజేసినటు వంటి, పాపమును, నశింపఁగఁజేసి=పోగొట్టి, నేర్పుతోడఁ=నిపుణతతో, నన్ను, నిర్వహింపుము=కాపాడుము, నాప్రాణములకు=నాపంచప్రాణము లకు, పరమసంతోషమాయె=మిక్కిలి సంతసము గల్గినది, నీరజాక్ష! నీఋణ ముఁ=నీయప్పును, తీర్చుకొన నేర=తీర్చుకొనజాలను.

తా. ఓనరసింహా! నవసరోజదళాక్షా! నన్ను పెంచెడు దాతవు నీవని ధైర్యముతో నుంటిని. నీలవర్ణా! తండ్రీ! నామనంబున నిన్ను నమ్మినం దుకు మేలు నాకుచేయుము. ఆహాహా! నీయంతటి పాలకుని నే నెక్కడను చూడలేదు. భూమిలో నీ నామము కొనియాడవచ్చును. ఇదివఱకుజేసిన పాపములను పోగొట్టి నేర్పుగా నన్ను గాపాడుము. నాపంచప్రాణములకు మిగుల సంతోషమాయెను. నీరజాక్షా! నీఋణము నేదీర్చుకొనలేను.

సీ. ఫణుల పుట్టలమీఁద ♦ బవ్వళించిన యట్లు
పులుల చోటులఁ జేరఁ ♦ బోయినట్లు
మకరివర్గం బున్న ♦ మడుఁగుఁ జొచ్చినయట్లు
గంగదాపున నిండ్లు ♦ గట్టినట్లు
చెదలభూమిని జాఁప ♦ చెఱఁగుఁ బఱచినయట్లు
ఓటిబిందెలఁ బాల ♦ నునిచినట్లు
వెఱ్ఱివానికి బహు ♦ విత్తమిచ్చిన యట్లు
కమ్మగుడిసె మందు ♦ గాల్చినట్లు
తే. స్వామి నీభక్తవరులు దు ♦ ర్జనులతోడఁ
జెలిమిఁ జేసినయట్లైనఁ ♦ జేటువచ్చు ॥భూ॥ 94

టీ. భూషు...దూర, స్వామి=ఓప్రభూ! నీభక్తివరులు=నీభక్తులయిన వారు, దుర్జనులతోడన్=దుర్మార్గులతో, చెలిమిన్=స్నేహమును, చేసిన యట్లయినన్=చేసినచో, ఫణుల=పాములయొక్క, పుట్టలమీఁదన్=పుట్టలపైని, పవ్వళించినయట్లు=పరుండినట్లును, పులులచోటులన్=పులు లుండు చోటులను, చేరబోయినట్లు=సమీపించినట్లును, మకరివర్గంబున్న=మొసళ్ళ గుంపులున్నటువంటి, మడుఁగుఁజొచ్చినయట్లు=మడుఁగులో ప్రవేశించిన ట్లును, గంగదాపునన్=గంగాతీరమున, ఇండ్లుగట్టినట్లు, చెదలభూమిని= చెదలున్నచోట, చాఁపఁచెఱఁగున్=చాఁపచెంగును, పఱచినయట్లు, ఓటి బిందెలన్=చిల్లులుపడిన బిందెలయందు, పాలను, ఉనిచినట్లు=ఉంచినయ ట్లును, వెఱ్ఱివానికి, బహువిత్తము=విశేషధనము, ఇచ్చినయట్లు, కమ్మ గుడిసె=తాటియాకు పాకయందు, మందున్=బాణాసంచాయను మందు, గాల్చినట్లు, చేటువచ్చు=కీడువచ్చును.

తా. ఓనరసింహా! పాములపుట్టలమీఁద పరుండినవిధమునను, పులు లున్నప్రదేశములకుబోయినవిధమునను, మొసళ్ళగుంపుగల మడుగులో ప్రవే

శించినవిధమునను, గంగాతీరమున నిండ్లుకట్టిన మోస్తరుగానను, చెరలున్న చోట చాపచెంగుపఱచినరీతిగానున్ను, చిల్లులబిందెలలో పాలుపోసినతీరునను, వెఱ్ఱివానికి యెక్కువధనమిచ్చిన తీరునను, తాటిపూఁకపాకలో మందుగాల్చినమోస్తరుగానున్ను, నీభక్తులు దుర్జనులతో స్నేహము చేసినట్లయిన కీడువచ్చును.

సీ. దనుజ సంహార నీకు ♦ దండంబు దండంబు
ఇందిరాధిప నీకు ♦ వందనంబు
పతితపావన నీకు ♦ బహు నమస్కారముల్
నీరజాతదళాక్ష ♦ నీకు శరణు
వాసవార్చిత మేఘ ♦ వర్ణ నీకు శుభంబు
మందరధర నీకు ♦ మంగళంబు
కంబుకంధర శార్ఙ్గ ♦ కర నీకు భద్రంబు
దీనరక్షక నీకు ♦ దిగ్విజయము
తే. సకల వైభవములు నీకు ♦ సార్వభౌమ
నిత్యకల్యాణములు నగు ♦ నీకు నెపుడు ॥భూ॥ 95

టీ. భూష...దూర, దనుజ=రాక్షసులను, సంహార=సంహారించినవాఁడా! నీకు, దండంబుదండంబు, ఇందిర=లక్ష్మీదేవికి, అధిప=భర్తయైనవాఁడా! నీకువందనంబు, పతితపావన=పాపులను పవిత్రులుగాఁజేయువాఁడా! నీకు, బహునమస్కారముల్=అనేకదండములు, నీరజాత=నీళ్ళయందుపుట్టినతామర, దళాక్ష = రేకులవంటికన్నులుగలవాఁడా! నీకు, శరణు=కాపాడుము, వాసవార్చిత=ఇంద్రునిచేపూజింపబడినవాఁడా! మేఘవర్ణ=మేఘమువలెనల్లనిశరీరచ్ఛాయగలవాఁడా! నీకుశుభంబు, మందరధర=మందరపర్వతమును ధరించినవాఁడా! నీకుమంగళంబు, కంబు=శంఖమువంటి కంధర=కంఠముగలవాఁడా! శార్ఙ్గ=శార్ఙ్గమనువింటిని, కర=చేతియందు ధరిం

చినవాఁడా! నీకు భద్రంబు=నీకుసుఖముగాక, దీనరక్షక=దీనులరక్షించెవాఁడా! నీకు, దిగ్విజయము=అన్నిదిక్కులయందుజయముకల్గుగాక, సార్వభౌమ=రాజాధిరాజా, నీకు, సకలవైభవములు=సమస్తవిభవములు, నీకున్, ఎపుడు=ఎల్లప్పుడును, నిత్య=ఎడతెగని, కళ్యాణములున్=శుభములు, అగు=అగునుగాక.

తా. ఓనరసింహా! దనుజసంహారా! లక్ష్మీప్రియా! పతితపావనా! నీరజాతదళాక్షా! వాసవార్చితా! మేఘవర్ణా! మందరగధరా! కంబుకంధర! శార్ఙ్గపాణీ! దీనరక్షకా! సకలలోకసార్వభౌమా! నీకు వందనములు. శరణు, శుభము దిగ్విజయములు గల్గుగాక! సకలవైభవములు నిత్యకళ్యాణములు నీకు గల్గుగాక!

సీ. మత్స్యావతారమై ♦ మడుఁగులోపలఁజొచ్చి
సోమకాసురుఁ ద్రుంచి ♦ చోద్యముగను
దెచ్చివేదము లెల్ల ♦ దేవభూసురులకు
మెచ్చి యిచ్చితి వీవు ♦ మేలునొంద
నావేదముల నియ్య ♦ నాచారనిష్ఠల
ననుభవించుచు నుండు ♦ రవనిసురులు
సకల పాపంబులు ♦ సమసిపోవునటంచు
మనుజులందఱు నీదు ♦ మహిమదెలిసి

తే. యుందు రిటువంటివారు నీ ♦ యునికి దెలియు
వారలకు వేగ మోక్షంబు ♦ వచ్చునసఘ ॥భూ॥ 96

టీ. భూ... మూర, అనఘ=ఓపాపములులేనివాఁడా! మత్స్యావతారమై=చేపరూపముధరించి, మడుగులోపలన్=సముద్రమునందు, చొచ్చి=ప్రవేశించి, సోమకాసురున్=సోమకుఁడనురాక్షసుని, చోద్యముగను=ఆశ్చర్యముగ, త్రుంచి=చంపి, వేదములు=నాల్గువేదములు, ఎల్ల=అన్ని

టిని, తెచ్చి=తీసుకవచ్చి, దేవభూసురులకు=దేవతలకును, బ్రాహ్మణులకును మేలు + ఒందన్=ఉపకారముహొందునటుల, ఈవు=నీవు, మెచ్చియిచ్చితివి ఆవేదములనియ్యన్=ఆవేదములనట్లుతెచ్చి ఈయఁగా, అవనిసురులు=బ్రాహ్మణులు, ఆచారనిష్ఠలన్=నియమపూర్వకముగా, ఆచారములను, అనుభవించుచునుందురు=పొందుచుందురు, మనుజులందఱు=మానవులందఱు, సకలపాపంబులు=అన్నిపాపములు, సమసిపోవును + అటంచు=పోవునని, నీదు=నీయొక్క, మహిమదెలిసి=గొప్పతనముతెలుసుకొని, ఉందురు, ఇట్టివారలకు=ఇటువంటివారలకును, నీయునికి=నీనిజస్థితి, తెలియువారలకు, వేగన్=శీఘ్రముగ మోక్షంబు=ముక్తి, వచ్చున్=వచ్చును.

తా. ఓనరసింహా! మత్స్యావతారమెత్తి సముద్రమునందు ప్రవేశించి సోమకాసురుని ఆశ్చర్యముగాచంపి, నాల్గువేదములను తెచ్చి దేవబ్రాహ్మణులకు మేలునొంద మెచ్చియిచ్చితివి నీవు. ఆవేదములిచ్చుటచే బ్రాహ్మణులు నియమపూర్వకముగా ఆచారములపొందుచుందురు. అందుచే మనుష్యులందఱు సకలపాపములుపోవునని నీమహిమతెలిసికొనియుందురు. అట్టివారలకును, నీనిజస్థితిని తెలుసుకొన్నవారలకును, వెంటనే ముక్తి దొరకును.

సీ. కూర్మావతారమై ♦ కుధరంబు క్రిందను
గోర్కెతో నుండవా ♦ కోమరు మిగుల
వరహావతారమై ♦ వనభూములను జొచ్చి
శిక్షింపవా హిర ♦ ణ్యాక్షు నసురుడు
నరసింహమూర్తివై ♦ నరభోజను హిరణ్య
కశిపునిఁ ద్రుంపవా ♦ కాంతిమీఱ
వామనరూపివై ♦ వసుధలో బలిచక్ర
వర్తి నణంపవా ♦ వైరముడిగి
తే. యిట్టిపనులెల్లఁ జేయగా ♦ నెవ్వరికిని
దగును నరసింహ నీకె కా ♦ దగును గాక ॥భూ॥ 97

టీ. భూప ..దూర, కూర్మావతారమై = తాఁబేలురూపముధరించి, కోమరుమిగులన్ = ఒప్పిదముగా, కునరంబు = పర్వతము, గ్రిందను, కోర్కె తోన్ = ఇష్టముతో, ఉండవా = ఉండలేదా? వరహావతారమై = పందిరూపు ముధరించి, వనభూములనుఁజొచ్చి = అరణ్యప్రదేశములందు ప్రవేశించి, అపుడు = ఆసమయమున, హిరణ్యాక్షున్ = హిరణ్యాక్షుఁడను రాక్షసుని, శిక్షించవా = చంపలేదా? నరసింహమూర్తివై = నరసింహావతారముదాల్చి, నరభోజను = నరులను తినువాఁడను, హిరణ్యకశిపున్ = హిరణ్యకశిపుఁడను రాక్షసుని, కాంతిమీఱన్ = పరాక్రమముతో, త్రుంపవా = సంహరింపలేదా? వామనరూపమై = వామనుఁడవై, వసుధలో = భూమియందు, బలిచక్రవర్తిని, వైరముడిగి = విరోధముమాని,(స్నేహముతో)అణంపవా = కుంగింపలేదా? ఇట్టి పనులెల్లన్ = ఇటువంటిగొప్పకార్యములను, చేయఁగా = చేయుటకు, ఎవ్వరికిని దగును = ఎవరికిజెల్లును? నీకెకాన్ = నీకొక్కనికే, తగునుగాక = చెల్లునుగాని.

తా. ఓనరసింహా! కూర్మావతారమెత్తి ఒప్పిదముగా మందరపర్వత మును మోయలేదా! వరహావతారమెత్తి అడవులలో ప్రవేశించి హిరణ్యా క్షునిచంపలేదా! నరసింహావతారమెత్తి నరభోజనుఁడయిన హిరణ్యకశిపుని పరాక్రమముతో చంపలేదా? వామనమూర్తివై భూమియందు బలిచక్ర వర్తిని స్నేహభావముతో క్రుంగింపలేదా? ఇట్టిఘనకార్యములు చేయుటకు నీకొక్కనికే చెల్లునుగాని, యితరు లెవ్వరికిని సాధ్యపడవు.

సీ. లక్ష్మీశ నీదివ్య ♦ లక్షణ గుణముల
వినజాల కెప్పుడు ♦ వెఱ్ఱినైతి
నావెఱ్ఱి గుణములు ♦ నయముగా ఖండించి
నన్ను రక్షించుమో ♦ నళిననేత్ర
నిన్ను నే నమ్మితి ♦ నితర దైవముల నే
నమ్మలే దెప్పుడు ♦ నాగశయన

కాపాడినను నీవె ♦ కష్టపెట్టిన నీవె
నీపాదకమలముల్ ♦ నిరత మేను

తే. నమ్మియున్నాను నీ పాద ♦ నళినభక్తి
వేగ దయచేసి రక్షించు ♦ వేదవేద్య ॥భూ॥ 98

టీ. భూష...దూర, వేదవిద్య = వేదములచే తెలియబడువాఁడా! లక్ష్మీశ=లక్ష్మీదేవికిభర్తయైనవాఁడా! నీదివ్య=నీమహిమగలట్టియు, లక్షణ= యోగ్యములగునట్టియు, గుణములన్=గుణములను, వినఁజాలక=విన లేక, ఎప్పుడు=ఎల్లప్పుడును, వెఱ్ఱినైతి=వెఱ్ఱివాఁడనయితిని, ఓనళిననేత్ర=ఓపద్మాక్షా! నావెఱ్ఱిగుణములు=నాచెడుగుణములు, నయముగా=చక్కఁగా, ఖండించి=పోఁగొట్టి, నన్ను రక్షింపుము=కాపాడుము, నాగశయన=శేషశాయీ! నిన్ను, నేనమ్మితిన్, ఇతరదైవములన్=ఇతరములైన దేవతలను, ఏన్=నేను, నమ్మలేదు, ఇప్పుడు=ఇప్పుడైనను, కాపాడినను=రక్షించినను, నీవె= నీవేసుమా! కష్టపెట్టిననీవె=బాధించినను నీవేసుమా! నీపాదకమలముల్= నీపాదపద్మములను, నిరతము=ఎల్లప్పుడును, ఏను=నేను, నీపాదనళినభక్తి= నీపాదపద్మములందలి భక్తితో, నమ్మియున్నాను = నమ్ముకొనియుంటిని, వేగ=వెంటనే, దయచేసి=ఇచ్చి, రక్షించు=రక్షింపుము.

తా. ఓనరసింహా! లక్ష్మీశా! నీదివ్యమహిమలుగల్గి యోగ్యములైనట్టి గుణములను తెలిసికొననేరక ఎల్లప్పుడు వెఱ్ఱినైతిని. ఓనళిననేత్రా! నావెఱ్ఱిగుణములు పోఁగొట్టి నన్ను కాపాడుము. నాగశయనా! నేను నిన్నే నమ్ముకొంటినిగాని యితరదైవముల నమ్మలేదు. ఇప్పుడు రక్షించినను నీవె; బాధించినను నీవె; నేను నిత్యమును నీపాదపద్మముల నమ్ముకొనియున్నాను. వేదవేద్యా! నీపాదపద్మములభక్తి వేగమేయిచ్చి రక్షింపుము.

సీ. అమరేంద్రవినుత ని ♦ న్ననుసరించిన వారు
ముక్తిఁబొందిరి వేగ ♦ ముదముతోడ

నీపాద పద్మముల్ ♦ నెరనమ్మి యున్నాను
నాకు మోక్షంబిమ్ము ♦ నళిననేత్ర
కాచి రక్షించు నన్ ♦ గడతేర్చు వేగమే
నీసేవకునిఁ జేయు ♦ నిశ్చయముగ
గాపాడినను నీకుఁ ♦ గైంకర్య పరుడనై
చెలఁగి నీపనులను ♦ జేయువాఁడ

తే. ననుచు బలుమాఱు వేఁడెద ♦ నబ్జనాభ
నాకుఁ బ్రత్యక్షమగుము ని ♦ న్నమ్మినాను ॥భూ॥ 98

భూప...దూర, అమరేంద్ర=దేవేంద్రునిచే, వినుత=పొగడబడిన వాఁడా నిన్ను, అనుసరించినవారు=వెంబడించినవారు, ముదముతోడన్=సంతోషముతో, వేగ=శీఘ్రముగ, ముక్తిన్=మోక్షమును, పొందిరి, నళిననేత్ర! నీపాదపద్మముల్=పద్మములుబోలు నీపాదములను, నెఱ=చక్కఁగా, నమ్మియున్నాను, నాకు, మోక్షంబు, ఇమ్ము=దయచేయుము, కాచి=కాపాడి, రక్షించు, వేగమే=వెంటనే, నన్=నన్ను, కడతేర్చు=దరిఁజేర్పుము, నిశ్చయముగ=నిజముగ, నీసేవకునిన్=నీదాసునిగా, చేయు=చేయుము, కాపాడినను=రక్షించినయెడల, నీకున్=నీకు, కైంకర్యపరుఁడనై=సేవజేయువాఁడనై చెలగి=సంతోషముతో, నీపనులను = నీకార్యములను, చేయువాఁడన్=చేయువాఁడను, అబ్జనాభ=నాభియందుపద్మముగలవాఁడా! అనుచున్=ఈవిధముగాఁ జెప్పుచు, పలుమాఱు=అనేకపర్యాయములు, వేఁడెదన్=ప్రార్థించెదను, నిన్నెనమ్మినాను = నిన్నెనమ్మికొనియున్నాను, నాకున్=నాకు, ప్రత్యక్షమగు=కనఁబడుము.

తా. ఓనరసింహా! దేవేంద్రవినుతా! నిన్ను వెంబడించినవారు సంతోషముతో వెంటనేముక్తిఁబొందుదురు. నళిననేత్రా! నీపాదపద్మములను సంతోషముతో నమ్మికొనియున్నాను. నాకు ముక్తినిమ్ము. కాచిరక్షించు

ము. వెంటనే నన్ను దరిఁజేర్పుము. నిజముగా నీసేవకునిగా నన్ను జేయుము. కాపాడినచో నీకు సేవజేయువాఁడనై సంతోషముతో నీపనులను జేయువాఁడ నని అనేకసార్లు వేడుకొనుచుంటిని. అబ్జనాభా! నిన్నే నమ్మినాను నాఁకు దయతో నీదర్శనమిమ్ము.

సీ. శేషప్ప యనుకవి ♦ చెప్పిన పద్యముల్
చెవుల కానందమై ♦ చెలఁగుచుండు
నే మనుజుండైన ♦ నెలమి నీ శతకము
భక్తితో విన్న స ♦ త్ఫలము గలుగుఁ
జెలగి యీపద్యముల్ ♦ చేర్చి వ్రాసినవారు
కమలాక్షు కరుణను ♦ గాంతు రెపుడు
నింపుగాఁ బుస్తకం ♦ బెపుడుఁ బూజించిన
దురితజాలంబులు ♦ దొలఁగిపోవు
తే. నిద్ది పుణ్యాకరంబని ♦ యెపుడు జనులు
గష్టమెన్నక పఠియింపఁ ♦ గలుగు ముక్తి ॥భూ॥ 100

టీ. భూష...దూర, శేషప్పయనుకవి=ఈశతకమును రచించిన శేషప్పయనేకవి, చెప్పినపద్యముల్=చెప్పినట్టిపద్యములు, చెవులకు, ఆనందమై=ఆనందమును గలిగించునవై, చెలఁగుచుండుఁ=ఒప్పుచుండును, ఏమనుజుండైనఁ=ఏమానవుడైనఁ, ఎలమిఁ=ప్రేమతో, ఈశతకము=ఈనృసింహ శతకమును, భక్తితోవిన్నఁ=భక్తి గలిగివిన్నచో, సత్ + ఫలము=సత్ఫలము=మంచిఫలము, కలుగున్=చేకూరును, చెలఁగి=సంతసించి, ఈపద్యముల్, చేర్చి=కూర్చి, వ్రాసినవారు=వ్రాసినటువంటివారలు, కమలాక్షు=శ్రీమహావిష్ణువుయొక్క, కరుణనుఁ=దయను, ఎపుడుఁ=ఎల్లప్పుడును, కాంతురు=పొందుదురు, ఇంపుగాఁ=ఇష్టముతో, ఈపుస్తకంబు=ఈ"నరసింహశతకము"

ఎపుడుఁ=ఎల్లప్పుడును, పూజించిన=పూజించినచో, దురితజాలంబులు, పాపసముదాయములు, తొలగిపోవుఁ = నశించును, ఇద్ది=ఈపుస్తకము పుణ్య+ఆకరంబని=పుణ్యాకరంబని=పుణ్యములకు చోటనుకొని, ఎపుడు= ఎల్లప్పుడు, జనులు=మనుష్యులు, కష్టము=శ్రమమును, ఎన్నక=ఎంచక, పఠియింపఁ=చదివినయెడల, ముక్తి=మోక్షము, కలుగుఁ=లభించును.

తా. శేషప్పయను కవీశ్వరుఁడు రచించినపద్యములు చెవులకానందమై యొప్పుచుండును. ఏమానవుఁడైన నీశతకమును భక్తితో విన్నచో సత్ఫలములభించును. సంతోషముతో యీపద్యములుకూర్చి వ్రాసినవారు నిత్యమును విష్ణుమూర్తిప్రేమను పొందుదురు. ప్రేమతో యీపుస్తకమును యెప్పుడు పూజించినను పాపజాలములు నశించును. ఈ "నరసింహశతకము" పుణ్యమునకు స్థానమనుకొని యెప్పుడును మానవుఁడు కష్టమునెంచక చదివినచో ముక్తిగలుగును.

శ్రీనరసింహార్పణమస్తు.

నరసింహశతకము టీకాతాత్పర్యసహితముగా

సంపూర్ణము.



# నవలలు—పరిశోధక నవలలు

| | |
|---|---|
| పంజాబు మెయిలు | రు 0-12 |
| నీవేనా | 0-12 |
| చదువుకొన్న భాగ్య (Educated wife) | 0-12 |
| శక్తికుమారి | 0-12 |
| అయిదులక్షలరూపాయలు | 0-12 |
| అల్లూరి సీతారామరాజచరిత్ర | 0- 8 |
| రమాసుందరి 1, 2 భా॥ | 1- 8 |
| హాతింతాయి | 0-12 |
| విషహృదయము | రు 1- 0 |
| టోపీదాసు కామిక్ | 0- 6 |
| వలపులరాణి | 0-12 |
| దొంగలనాయకుఁడు | 0-12 |
| అర్ధరాత్రపువింత 3 హత్యలు | 0-12 |
| లోకాభిరామాయణంకామిక్ | 0- 8 |
| పరిశోధన | 0-12 |
| మోహపిచాచము 1 వ భా॥ | 0-12 |
| డిటో రెండవభాగము | 0-12 |

# కథలు—చరిత్రలు

| | |
|---|---|
| శ్రీనాధకవి చరిత్ర | 0-12 |
| భోజకాళిదాసు కథలు | 0-12 |
| భట్టివిక్రమార్కుల కథలు | 1- 4 |
| గులోబకావళికథలు | 0-12 |
| తెనాలిరామకృష్ణకవి చరిత్ర | 0-12 |
| మహాభక్తవిజయమును 30 మహాభక్తుల కథలు | 1- 0 |
| మహాపతివ్రతల కథలు | 1- 0 |
| పండ్రెండురాజుల కథలు అను శ్రీకృష్ణబోధామృతం | 0-12 |
| శుకసప్తతి కథలు | 0- 8 |
| మదనకామరాజు కథలు | 0-12 |
| 16 రాజుల కథలు | 0-12 |

# శృంగార గ్రంథములు

| | |
|---|---|
| పడకటింటిముచ్చట్లు | 0-12 |
| సతీపురుషరహస్యములు | 1- 0 |
| శృంగారపద్యములు | |
| లౌలెటర్సుకు ఉపయోగము | 0- 4 |
| మన్మధసామ్రాజ్యము అను కళాశాస్త్ర రహస్యములు | 0-12 |
| అంతఃపుర రహస్యాలు | 0-12 |
| మోహలేఖలు అను లౌలెటర్సు | 0-12 |

# టీకాశతకములు

| | | |
|---|---|---|
| బాలరామాయణం | టీక. | 0- 2 |
| భాస్కరశతకం | ,, | 0- 4 |
| కుమారీశతకం | ,, | 0- 2 |
| వేమనశతకం | ,, | 0- 3 |
| గజేంద్రమోక్షం | ,, | 0- 6 |
| కాళహస్తీశ్వరశతకం | ,, | 0- 6 |
| సుమతీశతకం | టీక. | 0- 2 |
| నరసింహశతకం | ,, | 0- 4 |
| కృష్ణశతకం | ,, | 0- 2 |
| దాశరధీశతకం | ,, | 0- 4 |
| రుక్మిణీ కళ్యాణం | ,, | 0- 6 |
| శివానందలహరి | ,, | 0- 8 |

కొండపల్లి వీరవెంకయ్య, శ్రీసత్యనారాయణ బుక్కుడిపో, రాజమండ్రి.